# సమర్థ సద్గురు

## ఆధ్యాత్మిక మాసపత్రిక

శ్రీకాళీగార్డెన్స్ ఆశ్రమం - 522508, గుంటూరు జిల్లా
ఫోన్ : (0863) 2293280, 2293564, 2293206
web: www.mathaji-babuji.org samardhasadguru@rediffmail.com



Volume 29 Issue 1
No.of Pages 44
SEPTEMBER 2009

| | | |
|---|---|---|
| 5సం॥లచందా | రు. | 250.00 |
| 2సం॥ల చందా | రు. | 120.00 |
| సంవత్సర చందా | రు. | 60.00 |
| విడిప్రతి వెల ..... .. | రు. | 5.00 |

బ్యాంక్ డ్రాఫ్ట్స్ A/C.Y.S.C.K.P.M చారిటబుల్ ట్రస్ట్ పేరులో డ్రా చేయండి. M.O.,బ్యాంక్ డ్రాఫ్ట్స్ పంపవలసిన చిరునామా:
మేనేజరు
సమర్థసద్గురు మాగజైన్
శ్రీకాళీగార్డెన్స్-522508

Printed, Published by C.V. Ramana Babu, on behalf of YOGINI SRI CHANDRA KALI PRASADA MATHAJI CHARITABLE TRUST and Printed at Samardha Sadguru Publications, D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh, and published at D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh. Editor - Guda Siva Rama Murthy,

**ఈ సంచికలో....** **పేజీ**



**శరన్నవరాత్ర**
**శుభాకాంక్షలతో**

# భద్రవాక్యం

**ఏష సర్వేషు భూతేషు గూఢోzzత్మా న ప్రకాశతే।**
**దృశ్యతే త్వగ్రేయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః॥**

-కఠోపనిషత్

ఈ శ్లోకం కఠోపనిషత్ తృతీయ వల్లిలోని పదునొకండవ మంత్రము.

అంతకు ముందు మంత్రములలో ఇంద్రియముల కన్న ఇంద్రియార్థములు, ఆ ఇంద్రియార్థముల కన్న సంకల్ప వికల్ప రూపమైన మనస్సు, ఆ మనస్సు కన్న నిశ్చయాత్మకమైన బుద్ధి, ఆ వ్యష్టి రూపాత్మకమైన బుద్ధి కన్న సమష్టి బుద్ధి స్వరూపమైన మహత్తత్త్వము(హిరణ్య గర్భుడు), ఆ హిరణ్య గర్భరూపమైన మహత్తు కన్న ప్రత్యగాత్మ రూపమైన అవ్యక్తము ఒకదాని కన్న ఒకటి ఉత్కృష్టమైనవి అని, ప్రత్యగాత్మ రూపమైన ఆ అవ్యక్తము కన్న సకల కారణములకు కారణుడైన పురుషుడు పరమోత్కృష్టుడనియు, పరమ గతి అనియు, అట్టి చిన్మాత్ర ఘనస్వరూపుడైన పురుషుని కన్న అన్యమైనది కాని, పరమైనది కాని మరేదియు లేదు అని చెప్పబడినది.

పరమగతి అని చెప్పినందు వలన, గతి అనగానే రాకపోకలు ఉండును గనుక ఆ అక్షర పరబ్రహ్మ పదమునకు వెళ్ళివారు మరల జగత్తులోనికి రావలసి ఉంటుంది, ఇది ఎలా సాధ్యం? అన్న సందేహాన్ని నివారించటానికి ఈ మంత్రం చెప్పబడింది. ఇక్కడ గతి అనగా పోకడ అని అర్థముకాదు. ఇక్కడ పరమ గతి అనగా స్థితి అని అర్థము. పిపీలికాది బ్రహ్మ పర్యంతము సకల చరాచరములలో పూర్ణముగా నిండి వ్యాపించి ఉన్న పురుషుడు లేదా ఆత్మ గూఢముగా ఉండుటచే గోచరమగుటలేదు. కాని గురూపదిష్ట మహావాక్య శ్రవణ మనన నిదిధ్యాసనాదుల వలన బుద్ధి అంతర్ముఖమై ఏకాగ్రమైనపుడు ఆ ఆత్మ తత్త్వము అట్టి సూక్ష్మ బుద్ధిని అనుగ్రహించి, అతని స్వస్వరూపంగా సాక్షాత్కరిస్తుంది. సాక్షాత్కరిస్తుంది అంటే ఘటపటాదులవలె ఇంద్రియ గోచరం అవుతుందని కాదు. **అహం బ్రహ్మాస్మి** అనగా తానే ఆత్మ తత్త్వము అన్న ఎఱుక, అనుభూతి మాత్రమే ఉంటుంది. ఆ స్థితిలో రాకపోకలు సాగించేవాడు ఎవరూ మిగిలి ఉండక, పరమపురుష అపరోక్షానుభూతి ఒక్కటే ఉనికి కలిగి ఉంటుంది. *

# అమ్మ ఆశీస్సులు

**పుట్టువు లేని నీకభవ పుట్టుట క్రీడయ కాక పుట్టుటే**
**యెట్టనుడున్ భవాది దశలెల్లను జీవులయం దవిద్య దాఁ**
**జుట్టుచు నుండుఁ గాని నినుఁ జుట్టినదిం బలెఁ బొంత నుండియుం**
**జుట్టఁగ లేమిఁ దత్క్రియలఁ జొక్కని యొక్కటి వౌదు వీశ్వరా॥**

శ్రీమద్భావగవతము దశమ స్కంధమునందు శ్రీమన్నారాయణమూర్తి ఇంద్రాది దేవతలకు, నారదాదులకు ప్రసాదించిన వరప్రభావమున దేవకీ దేవి గర్భస్థుడైన పరమాత్మను స్తుతిస్తున్న, ప్రార్థిస్తున్న,అంతే కాదు స్వయముగా అనుభవిస్తూ మనకు అందించినది. శ్రీపోతనగారు వ్రాసిన ఈ పద్యము.

పుట్టుకే లేని నీకు ఈ పుట్టుట శ్రీమన్నారాయణా! ఆటయే కదా! జీవులు అవిద్య మాయకు లోనై ఉందురు. కాని ఈ జన్మలకు, సృష్టికే కారణుడవైన నీవే ఆ మాయను వశము చేసుకుని ఆవిర్భవించినట్లు శ్రీజగద్గురు దేవుడవై చెప్పావు శ్రీమద్భగవద్గీతలో -

**యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత।**
**అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్ ॥**

ఎప్పుడెప్పుడైతే ధర్మమునకు హాని, క్షీణతగలుగునో అధర్మము వద్ధియగునో అప్పుడప్పుడు నన్ను నేనే సృష్టించుకొందును (నేను అవతరించుచుందును) అన్నావు శ్రీగీతాచార్యుడిగా. అట్టి శ్రీగురు పరబ్రహ్మ అనంత లీలా వైభవములలో ముంచి తేలుస్తూ శ్రీకృష్ణ జన్మాష్టమి వేడుకలను ఎంతో నయనానందముగను, తత్త్వగోష్ఠితో హృదయానందముగను సాధకులైన మనందరి శ్రీ సద్గురు దేవులు ప్రసాదించినారు. ఇంతలోనే శ్రీ గణేశ చతుర్థి రావడము శ్రీ గురు గణపతిదేవులు అందించిన ఈ పండుగను కూడ భక్తులందరు పంచుకొనడము జరిగినది. "ప్రణవ స్వరూప వక్రతుండ." శ్రీ వినాయకుని మూర్తిలోనే ప్రణవము గోచరిస్తూ మనకు మూలమును గుర్తింపచేస్తూ ఉంటుంది. "త్వం మూలాధార స్థితో Z సి నిత్యం." ఉపనిషత్ పారాయణ చేస్తున్న సాధకునికి డైరెక్టుగా నీవు మూలాధారములో నిత్యము ఉంటావు. ఋతం వచ్మి సత్యం వచ్మి అంటే శ్రీస్వామి తత్త్వము సత్యము. త్రికాలాబాధితమైనది సత్యము, నిత్యము. మరి మార్పు, అసత్యము ఎక్కడిది? ఎప్పుడిది? సత్యము కాదు,లేదు అనుకుంటే అసత్యమే ముందు భయముగా రూపొంది దానివెంటే భవము కలుగుతోంది. అట్టి జనన మరణాది భయ రహితము చేస్తున్నది, భవములేకుండినది తానే. అట్టి దృఢాపరోక్ష జ్ఞానమును మనకు ప్రసాదించేది శ్రీ సత్య గురుదేవులొక్కరే. అట్టి శ్రీ సద్గురు దేవులు మనకు అఖండ సాధనా సంపత్తిని ఆత్మానందాన్ని ప్రసాదించెదరుగాక.

\- మీ అమ్మ

# సంపాదకీయం

శ్రీ కాళీ వనాశ్రమం, హైద్రాబాదు శాఖవారు ది. 7-8-2009 నుండి ది. 9-8-2009 వరకు శ్రీ వీరాంజనేయ స్వామి, శ్రీ నీలకంఠేశ్వర స్వామి (కె.పి.హెచ్.బి. కాలనీలో) వార్ల ఆలయ ప్రాంగణంలో నిర్వహించాలని తలపెట్టిన సత్సంగ కార్యక్రమం, స్థానిక భక్తుల, ఆలయ కార్యనిర్వాహక వర్గ సభ్యుల అభ్యర్థన మేరకు రెండు రోజులు పొడిగింప బడి ది. 11-8-2009 వరకు ఎంతో భక్తి భరితంగా జరిగాయి. శ్రీ మాతాజీ వారి అనుగ్రహ భాషణముతో పాటు డా॥ రామతారక పరబ్రహ్మ ప్రసాద్, శివ ప్రసాద్, మనోజ్ ప్రసాద్‌లు ఆంజనేయ తత్త్వం గురించి, సత్సంగం గురించి మాట్లాడారు. ది.9-8-2009 ఆదివారం ఉదయం ఆశ్రమ శాఖ ప్రాంగణంలో సామూహిక పాదపూజలు జరిగాయి. ఎందరో భక్తులు పూజలు చేసికొని, రక్షలు పొంది, మహా ప్రసాదం స్వీకరించి సద్గురు దేవుల కృపకు పాత్రులైనారు.

శ్రీ కృష్ణాష్టమి వేడుకలు ఆశ్రమంలో ది.13-8-2009 నుండి 15-8-2009 వరకు ఎంతో భక్తి భరిత వాతావరణంలో జరుపుకున్నారు. బయట ఊళ్ళ నుండి వచ్చే భక్తులకు శ్రవణం చేసే అవకాశం కలుగ చేయాలనే దృష్టితో ఆగస్టు నెల త్రయాహ్నిక సత్సంగ కార్యక్రమం తేదీలలో మార్పు చేసి కృష్ణాష్టమి పండుగ మూడు రోజులలో ఏర్పాటు చేశారు. శ్రీ మాతాజీ వారి అనుగ్రహ భాషణంతో పాటు, పరాశర ప్రసాద్, విజయేశ్వరానంద ప్రసాద్, జి. వెంకటేశ్వర్లుగారు(స్టేషన్ మాష్టర్) మనోజ్ ప్రసాద్, రమణ ప్రసాద్, రామ తారక పరబ్రహ్మ ప్రసాద్, సుషుమ్న ప్రసాద, జపమాల ప్రసాద, శ్రీమతి యమ్. సుశీల, శివ ప్రసాద్ శ్రీకృష్ణ తత్త్వము గురించి ప్రసంగించారు.

ఈ నెల 19 తేదీ(శనివారం) నుండి 30 వ తేదీ (బుధవారం) వరకు శ్రీదేవీ నవరాత్రి మహోత్సవములు అత్యంత వైభవోపేతంగా జరుగుతాయి. 27 వ తేదీ (ఆదివారం) మహర్నవమి నాడు జగన్మాత సామూహిక పూజలు, 28వ తేదీ (సోమవారం) విజయ దశమినాడు శ్రీ జగన్మాత సామూహిక పూజలు. నామకరణములు, అన్న ప్రాశనలు ఉంటాయి. ది 20 నుండి ది. 29వరకు ప్రతిరోజు శ్రీ మాతాజీ బోధామృతం ఉంటుంది. ది. 19నుండి ది.30 వరకు ప్రతిరోజు ఉదయం 8గం॥ శ్రీ రామ తారక పరబ్రహ్మ ప్రసాద్, వెంకట రమణ ప్రసాద్ గార్లచే శ్రీదేవీ భాగవత ప్రవచనం ఉంటుంది. 30వ తేదీ దీక్షా విరమణ, పూజాక్షతలు, జగన్మాత నగర పర్యటనోత్సవం, సద్గురు పాదపూజ ఉంటాయి. అందరికీ ఇదే మా హృత్పూర్వక ఆహ్వానం.

- గౌరవ సంపాదకుడు

# బాబూజీ ఉవాచ

(గత సంచిక తరువాయి) - స్వామి విజయేశ్వరానంద ప్రసాద్

త్యాగయ్యవంటి మహనీయుల మనస్సు ఎల్లపుడు పరమాత్ముని దివ్య చరణాలయందే లగ్నమై ఉంటుంది. అతను ఎల్లపుడు బ్రహ్మానందంలో ఓలలాడుతూనే ఉంటాడు. అలా పరమాత్ముని దర్శించ గలిగినపుడే మానవ జన్మకు సార్థకత. "నీకు సకల భోగభాగ్యాలూ ప్రసాదిస్తాను, నన్ను మాత్రం మరువకు" అంటాడు భగవానుడు. ఇది సత్యమే. కాని గురి తప్పితే, అంటే ఆచార్యుడు ప్రసాదించిన లక్ష్యమునందు మనస్సు నిలువక చలిస్తే, దుఃఖము. మనస్సును ఆ పరమాత్ముని పాదారవిందాలకు సమర్పణ చేస్తే, అవి సర్వ జన్మజన్మాంతర పాపాలన్నిటినీ హరించి, మలిన



మనస్సును శుద్ధం చేస్తాయి. మలిన మనస్సు గల వాళ్ళకు దుఃఖము. దానిని ఆ ప్రభువు దివ్య చరణాలయందు నిలిపితే, ఆ పాదాల నుండి ఉద్భవించిన గంగ ఆ మలినమంతటిని క్షాళన చేస్తుంది. "ఓం నమో నారాయణాయ" అనే అష్టాక్షరీ మహా మంత్రంపై మనస్సు నిలిపి ధ్యానిస్తే, ఆ ధ్యానతీర్థము జన్మ జన్మాంతర కర్మలను, పాపాలను, సర్వ సంకల్పాలను హరించి, శాంతిని ప్రసాదిస్తుంది. అప్పుడు మనస్సు సత్యముగా, చిత్తము శాంతిగా, బుద్ధి దయగా, అహంకారము ప్రేమగా మారుతాయి. ప్రతి మానవునిలోని మంచిని చూడగలుగుతుంది. శాంతిని పొందగలుగుతుంది. భగవానుడు ఐహిక ఆముష్మిక సుఖాలను అందిస్తాడు.

సుఖశాంతులను పొందగోరిన మానవుడు అందుకు అడ్డంగా ఉన్న అజ్ఞానమును తొలగించుకోవాలి. అజ్ఞానం తొలగాలంటే నారాయణుని, అంటే సద్గురుమూర్తిని ఆశ్రయించాలి. ఆ అడ్డు అహంకారము, మమకారము. అవి తొలగితే కనిపించే వెలుగే మోక్ష స్థితి. అదే ఆనందము.

పరమాత్ముని దర్శించలేని మానవుడు అంధుడు. సద్గురువును ఆశ్రయిస్తేగాని హృదయ పవిత్రత కలుగదు. పవిత్ర హృదయానికిగాని పరమాత్మ దర్శనం లభించదు. సద్గురు దేవుని అభయ హస్త కిరణాలలో జీవిస్తే చాలు. ఆయన జన్మ కర్మ బీజాలను హరించి ఆనందాన్ని ప్రసాదిస్తాడు.

అశాశ్వతములైన ధనధాన్య భోగాలకు మనస్సులో చోటివ్వక, శాశ్వతమైనది, మారనిది అయిన పరమాత్మ వస్తువు యందు సదా మనస్సు నుంచితే సకల శుభములు చేకూరుతాయి. మనస్సు పరమాత్ముని యందు నిలిపినా, పరమాత్మను మనస్సునందు నిలుపుకున్నా, యిక జపతపములేల?

కాలము విలువైనది. మహాత్ముల సన్నిధిలో ఉన్న సమయాన్ని ఎక్కువ భాగం వారి బోధను అందుకోవటానికి భగవంతుని గురించి తెలుసుకోవటానికి వినియోగించుకోవాలి. మేము వచ్చిన పని యిదే. మానవుని హృదయ కంజాతంలోని అజ్ఞాన తిమిరాన్ని తొలగించి, జ్ఞాన భాస్కర కిరణాలను ప్రవేశపెట్టటమే మా పని. భగవంతుని గురించి తెలుసుకోవలసిన అవసరం ఏమిటి? ఆయన దయ ఉంటేనే మన జీవితం నడుస్తుంది. అది లేకపోతే, ప్రక్క పొలాలన్నీ పండినా, మన పొలం పండదు. కరెంటు ఫుల్‌గా ఉంటేనే ఫాను బాగా తిరుగుతుంది. గాలి బాగా తగులుతుంది. అలాగే మానవునికి భగవంతుని అనుగ్రహం ఉంటేనే అతను వర్ధిల్లగలడు.

భగవానుడు దయామయుడు గనుక మనం ఏమి చేసినా చెల్లుతోంది. మనస్సు యింద్రియాలను మాటిమాటికీ విషయ సుఖాలవైపు పరుగెత్తిస్తున్నది. కాని యీ ధరణి రుచులు, కూరలు, పిండివంటలు, యితర విషయాలు ఎంత రుచికరంగా ఉన్నా, ఎంత సుఖం అనిపించినా, అది కొంత సేపేగాని తర్వాత విసుగే. మరీ ఎక్కువ అయితే రోగము, దుఃఖమే. కాని భగవానుని చరిత్ర అలా కాదు. అది ఎంతో కమనీయమైనది. ధరణి రుచులన్నిటికన్న మిన్న అయినది. ఆయన నామము అంత మధురమైనది కనుకనే రాధ ఆ నామరుచిని అంతగా మరిగినది. ఆ దివ్య నామమనే ఔషధ సేవ వలన కారాకులు డుల్లినట్లు కర్మములు రాలిపోయినవి. కర్మ బీజములు హరించి, కామక్రోధాదులు ఉడిగిపోయినవి. అంతరింద్రియాలైన మనో, బుద్ధి, చిత్త, అహంకారములు నాలుగూ సత్యము, శాంతి,దయ, ప్రేమగా మారినవి.

దారాపుత్రాదులు, బంధుమిత్రులు చూపే ప్రేమ కళంక సహితమైనది. కాని భగవానుని ప్రేమ కళంకరహితము. కనుకనే రాధాకృష్ణుల ప్రేమ కళంక రహితమైనది. అది జీవేశ్వరుల ప్రేమ, జీవేశ్వరులకు భేదం లేదు. అది విడదీయరాని బంధము. నదిలోని చేప గట్టున పడినపుడు గిలగిలలాడుతూ శాంతి లేకుండా తపించిపోతుంది. అది తిరిగి నదిలో పడినపుడే దానికి శాంతి.

-సశేషం

# మాతాజీ అభిభాషణ

(గతసంచిక తరువాయి)

-జపమాల ప్రసాద

మహాత్ములు చెప్పినట్లు చేయాలిగాని, వారు చేసినట్లు మనం చేయాలనుకుంటే మాత్రం పప్పులో కాలు వేసినట్లే. మహాత్ములు ఏదైనా చేయగలరు. వారిలాగ మనం చేయాలనుకుంటే అది అసంభవం. భగవంతుడి మీద పూర్తిభారం వేస్తే ఏటైమ్‌లో ఏది ఎలా జరగాలో అన్నీ ఆయనే చూసుకుంటాడు.

ఏ విషయానికి ఎంత ప్రాముఖ్యత ఇవ్వాలి అన్నది కూడా మనస్సుపైనే ఆధారపడి ఉంటుంది. ప్రాపంచిక విషయాలకే ప్రాముఖ్యతనిస్తే తద్వారా వచ్చే సుఖదు:ఖాలు రెంటినీ అనుభవిస్తూ ఉండాల్సిందే. అలాకాకుండా శాశ్వత సుఖం కావాలి అనుకుంటే మనస్సుని పరమాత్మపైనే నిలపాలి. ప్రతి మానవుడూ కూడా నాకు సుఖమే కావాలి, దు:ఖం వద్దు అని కోరుకుంటాడు. కానీ దు:ఖభూయిష్ఠ కర్మలని చేస్తూ సుఖం కావాలి అంటే ఎక్కడి నుండి వస్తుంది?



మహాత్ముల ధ్యాస ఎప్పుడూ కూడా జీవులందరినీ ఎలా తరింపజేయాలా అనే ఉంటుంది. కనుక వారిని ఆశ్రయిస్తే మనకి మారనటువంటి సుఖము, ఆనందము లభించే మార్గాన్ని చూపెడతారు. వారు స్వయంగా ఆచరించి మనచేత ఆచరింపజేస్తారు. కనుకనే వారు ఆచార్యదేవులయ్యారు. వారి దివ్య జ్ఞానబోధ మనలోని అజ్ఞానమనే చీకటిని హరింపజేస్తుంది. మనని మనం ఉద్ధరించుకోవటం కోసం సాధన చేసికోవాలి అంతేకాని అది వేరే ఎవరికోసమో కాదు.

'ప్రభూ! నా సుఖము నీ దయే, దు:ఖమూ నీ దయే, రాగము, భోగము, రోగము, ఒకటేమిటి? సర్వమూ నీ దయయే కదా!' అని భగవంతుడి మీద పూర్తిగా భారం వేసేస్తే మన బాధ్యత అంతా ఆయనదే. మనకి ఎటువంటి కష్టం వచ్చినా ఆయనే దానిని దాటే ఉపాయం కూడా చూపెడతాడు. అంతా నీ దయ ప్రభూ అని మనం ఏమీ చేయకుండా తిని కూర్చుంటే మట్టుకు ఆయనేమి చేయడు. మన వంతు కృషిమనం చేసితీరాలి. అప్పుడు ఆయన అనుగ్రహం ఉంటుంది. ఎవరి వృత్తివారు సక్రమంగా చేయాలి. అప్పుడే తృప్తి, ఆనందం.

మనసుకి మనం ఏది అలవాటు చేస్తే అదే దానికి అబ్బుతుంది. దానిని నిరంతరం 'సత్సంగం' అనే మధుర రసంలో ఊరవేసి ఉంచితే ఆ రూపాన్నే పొందుతుంది. మనస్సులేనివాడు ఈ సృష్టిలో లేనేలేడు. మనస్సుకి లొంగినవాడు మానవుడు. మనస్సుని తమ అధీనంలో ఉంచుకున్నవారు మహాత్ములు. వారు మాధవ స్వరూపులు. మహాత్ములకి కూడా మనస్సు ఉంటుంది. కాని అది కాలిన త్రాడులాగా ఉంటుంది. దేనినీ బంధించదు. మానవుల మనస్సు కాలనిత్రాడు వంటిది. దానికి బంధించే శక్తి ఉంది. కావున ఎవరిని వారు ప్రేరణ చేసికొంటూ నిరంతరం ఆ జగన్మాత (భగవంతుని) నామస్మరణలో కాలం గడిపితే ఈషణత్రయములు నశించి సత్య, శివ, సుందర స్వరూపంగా ప్రకాశిస్తారు.

భగవంతుడు ఉన్నాడు అని నమ్మితే తరిస్తాం. లేడు అనుకుంటే మాయలో పడి నాశనమయిపోతాం. మనసులో కామ క్రోధాదులకు చోటిస్తే మనని భయం ఆవరిస్తుంది. అందుకని వాటిని దరికి రానీయకుండా పథ్యం చేస్తూ గురుదేవులు ప్రసాదించిన లక్ష్యార్థాన్ని ఎల్లవేళలా సాధన చేయాలి. ఈ ప్రపంచంలో ఉండే విషయాలు కించిత్ సుఖాన్నే ఇస్తాయి. కడకి దు:ఖమే మిగులుతుంది. మహాత్ముల వాక్కులు విన్నంతమాత్రాన సరిపోదు. విన్న బోధని ఆచరించడం ఎంత కష్టమైనా, పట్టుదలతో, విశ్వాసంతో ఆచరించిన నాడే మనకా మహోన్నత స్థితి లభిస్తుంది. అంతటి మహోన్నత స్థితికి చేరుకోవడానికి కూడా కారణం మన మనస్సే కాబట్టి మనసెంత గొప్పదో చూశారా!

మనసు మాయ మరలించగా,తనువు తీపి తొలగించగమార్గమొక్కటే లక్ష్య సాధనం,అందుకోండి శ్రీగురు నామం.... సద్గురు నామం (అని శ్రీమాతాజీవారు అందరిచేత సద్గురు నామం చేయించారు).

'మాయ, మాయ మాయ' అని జపం చేస్తే మాయలోనే మునిగిపోతాం. ఇక ఎన్న జన్మలకైనా తేలడమనేది లేదు. 'గురునామ మంత్రరాజాన్ని' (మంత్రారాజ్యం అనేవారు గురుదేవులు) మనకిచ్చారు. ఆ మంత్రరాజ్యంలో హాయిగా ఓలలాడాలి. నాట్యం చేయాలి. ఆనందం మనందరి సొత్తు. భగవంతుడు (గురుదేవుడు) మన సొంత ప్రాపర్టీ (ఆస్తి). అటువంటి సద్గురుదేవుల పాదాన్ని ఆశ్రయించిన మనకి లోటేమిటి? అచంచల విశ్వాసంతో వారిమాటని ఆచరణలో పెడితే మనకి అనేక ఇక్కట్లు తెచ్చిపెడుతున్న మనస్సే మనకి మంచి మిత్రుడిగా మారిపోతుంది. *

# సన్నిధిలో సంభాషణ

(గతసంచిక తరువాయి) - పరాశర ప్రసాద్

ఈ రోజు ఉదయం శ్రీబాబు భక్తులనుద్దేశించి మాట్లాడుతూ మనకి శత్రువులు మనలోనే ఉన్నారు. వారెవరండీ? అని ప్రసాదరావుగారిని ప్రశ్నించారు. 'అంతఃశత్రువులు బాబూ!' అని వారు సమాధానం చెప్పారు. శ్రీబాబు మాట్లాడుతూ 'వారు మనలో ఉండే రత్నాన్ని ఎలా కాజేయాలా? అని కాన్ఫరెన్స్ పెట్టి ఆలోచన చేస్తారు. వారే మనలోని కాముడు, క్రోధుడు, లోభుడు, మోహుడు, మదనుడు, మాత్సర్యుడు. ఏ రకంగా అయినా క్రింద పడినా, మీదపడినా గెలుపు మనదే, మనని ఓడించ గలిగిన వారు ఎవరు ఉన్నారు? అని ధీమాగా ఉన్నారు. కాని ఈ శత్రువుల బారి నుండి రక్షించ గలిగేది ఒక్కటే ఉన్నది. అదే గురులక్ష్యార్థం! అయితే మీ మనస్సుని ఆ లక్ష్యార్థము నందు నిలిపి, దాని యందు లయమైనప్పుడు మాత్రమే కామ, క్రోధాది గుణాలు సుగుణాలుగా మారతాయి. ఆ శక్తి గురులక్ష్యార్థానికి మాత్రమే ఉన్నది. మీ మనస్సు ఆ లక్ష్యార్థంపై నిలిపినప్పుడు ఏ మాత్రం లూజ్ కనెక్షన్ ఉన్నా ఆ శక్తిని పొందలేరు'.

ఇంతలో ఒక భక్తుడు ఒక పెద్ద పళ్ళెంలో భక్తుల నిమిత్తం స్వీట్స్ తీసుకువచ్చాడు. భక్తులంతా వారి దృష్టి అటువైపు మరల్చారు. వెంటనే శ్రీబాబు కల్పించుకుని 'దాని మీద ఉన్న దృష్టి మీకందరికీ భగవంతుడి మీద ఉంటే ఎంత బాగుంటుంది!' అన్నారు. రావుగారు కలుగజేసుకుని 'అది ప్రసాదం కదండీ! ప్రసాదమంటే గురుకృప! అదే దయ! అదే కటాక్షం! అందువలననే మా దృష్టి అటు మరలింది' అని తమ పాండిత్యాన్ని, లౌక్యాన్ని ప్రదర్శించారు.

వెంటనే శ్రీబాబు మాట్లాడుతూ 'అది మీ మనస్సుకి, జిహ్వకి రుచిని అందిస్తుంది లెండి. కాని దానిని మీరు ప్రసాదంగా గుర్తించి దాని విలువ తెలిసికోవాలంటే మీ మనస్సు నిలబడినప్పుడు కదా!' అన్నారు. ఇంతలో అనంతపద్మనాభ శాస్త్రి లేచి ప్రసాదం యొక్క విశిష్టతను తెలిపే పద్యం చదివి ప్రసాదం అంటే దుష్టశక్తులను నాశనం చేసేది అని చెప్పాడు.

శ్రీబాబు మాట్లడుతూ 'అంతవరకూ బాగానే ఉంది. నువ్వు ఇంతకాలం నుంచీ భగవంతుణ్ణి విశ్వసిస్తున్నావు కదా! ఎప్పుడైనా ఒక్కనాడైనా భగవంతుణ్ణి మనసారా పూజించి దర్శించావా? అలా చేస్తే పుష్పాలెందుకు? పూజలెందుకు? నాకు ఈ తిప్పలెందుకు? నీటి బుడగలా లేచావు పైకి! మరి నీవు చెప్పినదానికి ఆధారం శాస్త్ర ప్రమాణమే కదా! అంతేకాని అనుభవం

లేదుకదా! నిజంగా నీ మనస్సు నిలిస్తే అలా లేచి నన్ను ప్రశ్నిస్తావా? ఆనందిస్తావు కాని!' అన్నారు. శ్రీబాబు ఇంకా మాట్లాడుతూ ' మీరంతా పండితులు, చదువుకున్నవారు. మీ ముందు నేను మాట్లాడటమేమిటి? హనుమంతుడి ముందు కుప్పిగంతులు వేసినట్లు ఉంటుంది. ఎంత పండితుడు అయిన, ఎంత వేదాంతి అయిన, ఎన్ని శాస్త్రాలు చదివిన, ఎంత సాధన చేసిన, అంత్యకాలములో మనస్సు భగవంతునిపై నిలిపినప్పుడే జన్మరాహిత్యం. కాని మానవుడు రజో, తమో, గుణాలకు లొంగి, సోమరియై, తన కర్తవ్యాన్ని మరచి జీవిత కాలాన్ని వ్యర్థం చేసుకుంటున్నాడు. కాని గురుదేవుణ్ణి **గురుదేవా! జయదేవా! శరణు శరణు** అని ఒక్కసారి వేడుకుంటే సకల భోగభాగ్యాలు, శాంతిని అందజేస్తాడు ఆ సర్వరక్షకుడు, కరుణామయుడు. అంతేకాదు నీలోని కామ క్రోధాది గుణాలను, సుగుణాలుగా మార్చగలుగుతాడు.

గురుదేవుడు నాటినబీజము చవిటిభూమిని సహితము సుక్షేత్రముగా మార్చివేస్తుంది. మనం భూమిలో ఒక విత్తనాన్ని నాటేముందు దానిని రసాయనంతో కలిపి నాటుతాము. ఆ రసాయనము ఆ విత్తనముపై తన ప్రభావం చూపుతుంది. దీనికే ఇంత శక్తి ఉంటే గురు లక్ష్యార్థానికి ఎంత శక్తి ఉండాలి? అయితే మానవుడు దానిని గుర్తించడానికి వీలులేకుండా అవిద్య అనే ఆవరణ అడ్డు వస్తుంది. త్రికోణములు కలిగిన గాజుఫలకము కాంతికి ఎదురుగా ఉంచితే సప్తవర్ణాలు కనబడతాయి. ఆ గాజు పలక తీసివేస్తే కాంతి అంతా ఒక్కటిగా గోచరిస్తుంది. అలాగే మనలోని అవిద్య ఆవరణను తీసివేస్తే ఆనందమే మిగులుతుంది. అదే సత్వ, రజో, తమో గుణ సహితమైన ఆవరణ. గురులక్ష్యార్థం వాటిని సత్య, శివ, సుందరంగా ప్రకాశింపజేస్తుంది. అట్టి ప్రకాశవంతుడైన వానిని ఏ రకమైన శత్రువు మార్చలేదు.

మీకు ఇంకొక దృష్టాంతం చెబుతాను. గొంగళిపురుగు చాలా విషపూరితమైనది. అది మన ఒంటిపైన ప్రాకితే దురద కలుగుతుంది. దాని విషము పుట్ట కురుపును కూడా కలిగించవచ్చు. ఆ గొంగళిపురుగును మట్టితో కప్పి, గోడకి అతికించి దాని చుట్టూ భ్రమరము ఝుంకారము చేస్తూ తిరుగుతూ ఉంటుంది. ఆ శబ్దానికి ఆ పురుగు భయపడి తదాకారాన్ని పొంది, ఆకర్షవంతమైన సీతాకోక చిలుకగా మారుతుంది. దీనినే భ్రమర కీటక న్యాయం అంటారు. అలాగే భక్తులు గురులక్ష్యార్థంపై మనస్సు నిలిపినప్పుడు తదాకారాన్ని పొందగలుగుతారు. మహాత్ములు అట్టి స్థితిని పొందిస్తామంటే దానిని ఎంతమంది పొందటానికి ప్రయత్నిస్తున్నారు?

-సశేషం

## శ్రీకాళీగార్డెన్స్‌లో విశేషపూజా కార్యక్రమములు

**సెప్టెంబరు 2009**

4 శుక్ర పూర్ణిమ,శ్రీ సద్గురు పాదపూజ. శ్రీ మాతాజీ అర్ధ చాతుర్మాస్యం అశ్రమంలో జరుగుతుంది.

5 శని టీచర్స్ డే, ఉదయం 10 గం.లకు ఆచార్యదినోత్సవము,శ్రీ సద్గురు పాదపూజ.

14 సోమ శ్రీగురుదశమి, సత్సంగం,శ్రీ సద్గురు పాదపూజ.

17 గురు మాసశివరాత్రి.

**19 శనివారము నుండి సెప్టెంబరు 30వరకు శ్రీదేవీనవరాత్రోత్సవములు.**

ప్రతిరోజు ఉదయం 8 గం.లకు శ్రీ రామతారక పరబ్రహ్మ ప్రసాద్, మరియు శ్రీవెంకటరమణ ప్రసాద్ గార్లచే శ్రీదేవీ భాగవత ప్రవచనము. మధ్యాహ్నము జగన్మాత కుంకుమార్చనలు, హారతి, మంత్రపుష్పము, దర్బారు, భక్త సమారాధన సాయంకాలము 6 గం.లకు ప్రార్థన, 7 గం.లకు జగన్మాత సాయంకాలపూజ, తీర్థ ప్రసాదములు.

20 ఆదివారమునుండి 29 వరకు ఆధ్యాత్మిక ప్రవచనములు, శ్రీమాతాజీవారి అనుగ్రహభాషణము, శ్రీ గురుదేవుల దివ్య దర్శనము,బోధ (వీడియో), శ్రీ బాబూజీ మహరాజ్ వాడిన వస్తువుల మ్యూయజియమ్ ప్రదర్శన (అర్ధగంట)

19 శని ఉదయం 8.06 గం.లకు శ్రీమాతాజీవారి దీక్షా స్వీకారము

26 శని శ్రీ సరస్వతీపూజ, మూలా నక్షత్రం. దుర్గాష్టమి.

27 ఆది మహర్నవమి. శ్రీ జగన్మాత సామూహికపూజలు,

28 సోమ విజయదశమి, శ్రీ జగన్మాత సామూహికపూజలు, నామకరణములు, అన్నప్రాశనలు, అక్షరాభ్యాసములు రామాలయంలో జరుగుతాయి.

29 మంగ ఏకాదశి, ఏకాహం.

30 బుధ దీక్షావిరమణ, పూజాక్షతలు శ్రీమాతాజీ భక్తులపైన చల్లుతారు., రాత్రి 7 గం.లకు జగన్మాత ఊరేగింపు. రాత్రి 9 గం.లకు శ్రీ సద్గురు పాదపూజ.

**అక్టోబరు 2009**

4 ఆది పూర్ణిమ, శ్రీమాతాజీవారి 55వ జన్మదినోత్సవము,శ్రీ సద్గురు పాదపూజ,సత్సంగం, భక్త సమారాధన.

13 మంగ శ్రీ గురుదశమి, సత్సంగం, శ్రీ సద్గురు పాదపూజ.

16 శుక్ర మాసశివరాత్రి. నరక చతుర్దశి, సత్సంగం, శ్రీ సద్గురు పాదపూజ.

17 శని దీపావళి, శ్రీ సద్గురు పాదపూజ, భక్త సమారాధన.

# సత్సంగ సౌరభం

-శివ ప్రసాద్

(14-6-2009 జూన్ నెల త్రయాహ్నిక సత్సంగ కార్యక్రమాలలో చివరిరోజు ఉ.10గం.20ని.లకు బృందావనంలో శ్రీరామతారక పరబ్రహ్మప్రసాద్‌గారి ప్రవచన సంక్షిప్త రూపం) -ఎడిటర్

సత్సంగం అంటే అనేకసార్లు చెప్పుకున్నాము సత్ + సంగం అని. దేనితోనైనా సంగం ఉంటే సంగాత్ సంజాయతే కామః అంటుంది భగవద్గీత. సత్‌తో సంగంలో కూడ కామం ఉంటుంది. కాని అది సత్కామం. మామూలుగా కామం అంటే క + ఆమం అని. కం అంటే సుఖం. ఆమం అంటే రోగం. సత్ ఉంటే కామానికి వచ్చే రోగాలన్నీ పోతై. సత్‌ను కోరుకోవటం అంటే మందుపుచ్చుకున్నట్లు. ఎక్కువ తింటే రోగం వస్తుంది. మందు తీసుకొంటే పోతుంది. తరువాత ఇక మందు అక్కర్లేదు. సత్సంగం కూడ అటువంటిదే.

కొంత కాలం చేస్తే సత్సంగంకూడ నిస్సంగం కావాలి. అయితే మనకు సంగం పడుతున్నది కాని సత్ పట్టటంలేదు. 20 సంవత్సరాలుగా మందు పుచ్చుకుంటున్నామండీ! అయినా రోగం తగ్గటంలేదు అంటారు. రోగం తగ్గాలి అంటే ముందు ఈ స్థూలదేహాలు పోవాలి. అంతమాత్రం చాలదు. సూక్ష్మదేహాలు కూడ పోవాలి. అదీ చాలదు. కారణదేహం కూడ పోవాలి. ఇది వాసనల రూపంలో ఉంటుంది. ఆ వాసనలు కూడ నశించాలి. వాసనలన్నీ నశిస్తేగాని వాసుదేవదర్శనం కాదు. వాసుదేవుడు సర్వజగత్తులో సర్వత్రా వ్యాపించి ఉండేవాడు. వాడి దర్శనం కావాలి అంటే ఏ వాసనా ఉంకుండా పోవాలి.

సత్సంగం ప్రయోజనం నిస్సంగం కావాలి. అందుకే కొంతసేపు సత్సంగం చేసి, మాటలు వినిపించి, అనిపించి, ఆ మాటలను మనసుకు పట్టించుకున్న తరువాత నిశ్శబ్దంగా ధ్యానం చేసుకోమని చెప్తారు. నిశ్శబ్దం బ్రహ్మ ఉచ్యతే. శబ్దం కూడ బ్రహ్మమే. సర్వం బ్రహ్మ అని ఊరుకోలేదు. సర్వం ఖల్విదం బ్రహ్మ అని ఖలు అనే శబ్దాన్ని పెట్టారు. ఖలః అంటే దుర్మార్గుడు. ఖలు అంటే కదా! అని అర్థం. సర్వం ఖల్విదం బ్రహ్మ అంటే ఇదంతా బ్రహ్మమే కదరా! అని. అంటే ఇది బ్రహ్మమును బాగా తెలిసి, అలవాటైనవారు

చెప్పినమాట. ఇది బ్రహ్మమే కాని ఇంకొకటికాదు అని తనకు బాగా తెలుసు అన్న భావనలో ఉండేవారు చెప్పినమాట అది.

సత్సంగంలో ఇదంతా అసత్తు అన్న భావన చెయ్యాలి. భావన కలగాలి అంటే భాష కావాలి. భావ ప్రకటనకు భాష (భాస్) కావాలి. భాష శబ్దంతో ఉంటుంది. శబ్దం క్రమంగా తగ్గి నిశ్శబ్దం రావాలి. అక్కడ నిశ్శబ్దం బ్రహ్మ ఉచ్యతే అన్నారు.

నిశ్శబ్దం ఒక్కటే చాలదు. పంచభూతాలలో సూక్ష్మాతి సూక్ష్మమైన ఆకాశానికి సంబంధించినది శబ్దం. అన్నిటికంటె సాంద్రమైనది, స్థూలమైనది పృథ్వి. దానికి అయిదు గుణాలు అంటే శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధము అన్నీ ఉన్నాయి. తరువాత అంతకంటె కొంచెం సాంద్రత, స్థూలత్వము తక్కువగా కలిగినది జలం. దానికి శబ్ద, స్పర్శ, రూప, రసములనే నాలుగు గుణాలు ఉంటాయి. దానికంటె తక్కువ సాంద్రత కలిగినది అగ్ని. దానికి శబ్ద, స్పర్శ, రూపము మూడు గుణాలు ఉన్నాయి. అంత కన్న తక్కువ సాంద్రత కలిగినది, సూక్ష్మమైనది వాయువు. దానికి శబ్దము, స్పర్శ అనే రెండు గుణాలు మాత్రమే ఉంటాయి. అన్నిటిలోకి సూక్ష్మాతి సూక్ష్మమైనది ఆకాశం. దానికి శబ్దం ఒక్కటే గుణం.

మూడైతే స్పష్టంగా తెలుస్తాయి. అగ్నికి మూడుగుణాలున్నై, తేజస్సు కంటికి కనిపిస్తుంది. స్పర్శకు తెలుస్తుంది. అది చేసే శబ్దం వినిపిస్తుంది. జలానికి శబ్దము, స్పర్శ, రూపము, రసం ఉన్నై గనుక, అది ఇంకా స్పష్టంగా తెలుస్తుంది. పృథ్వి అన్ని ఇంద్రియాలకు స్పష్టంగా తెలుస్తుంది. వాయువు, ఆకాశం కంటికి కనిపించవు. అయితే వాయువు చలించినప్పుడు స్పర్శకు తెలుస్తుంది. ఆకాశం శాస్త్రం చెప్తున్నది కనుక తెలుస్తున్నది. ఏదీ లేనిది ఆకాశం. వాయువు సర్వత్ర ఉన్నది. వాయు స్సర్వత్రగో మహాన్(భగవద్గీత). వాయువు కూడ లేనిది ఇంకా పైన ఉన్నది. అది ఆకాశం. మనలో కూడ ఇవన్నీ ఉన్నై, కాని సూక్ష్మంగా ఉన్నందు వల్ల కనిపించవు.

పైకిపోయేకొద్దీ వాయుతత్త్వం కూడ ఇంకా ఇంకా సూక్ష్మమై ఆకాశతత్త్వం ఎక్కువ అయింది. అక్కడ కూడ శబ్దం ఉత్పన్నమవుతుంది. ఆత్మలో కూడ ఆకాశం గుణం ఉంది. ఆత్మ అంటే ఎఱుక. అంటే తెలియటం. సర్వత్రా వ్యాపించి ఉండేది ఆత్మ, మనం శరీరంలో సర్వత్రా వ్యాపించి ఉన్నాము కనుకనే మనను జీవాత్మ అని సర్వత్రా వ్యాపించి ఉన్న ఆత్మను పరమాత్మ

అని అన్నారు. కాళ్ళు చేతులు, తల ఇలా వేరే పేర్లు ఉన్నా, వాటన్నింటిలో నేనే ఉన్నాను. ఎలా ఉన్నావు? అంటే అలాగే ఉన్నాను అంటాముకాని తెలియదు.

పశువులకంటె మనుష్యులలో విశిష్టంగా ఉన్నది భాష. పశువులలో భాష స్పష్టంగా లేదు. మనకు శబ్దాలు, వాటికి అర్థాలు స్పష్టంగా ఉన్నై, దానితో భావం ప్రకటం చెయ్యటానికి, అంతేకాక భావానికి కూడ అందని భావాతీతమైన దానిని చెప్పటానికి ప్రయత్నించటం చేస్తాము. చివరకు అది చెప్పటానికి వీలైనది కాదు అని చెప్తాము.

**నా Z యమాత్మా ప్రవచనే న లభ్యః న మేధయా న బహునా శ్రుతేన।**
**యమే వైష వృణుతే తేన లభ్యః తస్యైష ఆత్మా వివృణుతే తనూగ్ స్వామ్॥**

(-కఠోపనిషత్)

నాయమాత్మా అంటే ఈ ఆత్మ ప్రవచనేన అంటే మాటలన్నింటిలో(best ) ఎంత చక్కగా చెప్పినా అది లభించేది కాదు. చివరకు అది చెప్పటానికి వీలులేనిదని తెలుస్తుంది. నమేధయా న బహునా శ్రుతేన - శాస్త్రాలు చదివితే రాదు. వింటేరాదు.

మరి సత్సంగంలో మనం చేసేది ఏమిటి? అంటే మనం చేసే ప్రయత్నం అంతా శబ్దజాలంలో ఉన్నది. కాని సత్సంగంలో సద్వస్తువును గురించి చిలవలుపలవలు చేర్చి మాట్లాడుతున్నాము. లోకాభిరామాయణం కంటే ఇది మంచిది.

సత్ అంటే మంచిది. అసత్ అంటే మంచిది కానిది. మంచిని అంటే సుఖాన్ని, శాంతిని ఇచ్చేది. డబ్బు కూడ సుఖం కోసమే. ఆత్మ యొక్క లక్షణం ఆనందం. సుఖం అంటే కూడ చాలదు. ఖం అంటే ఆకాశం. సుఖం అంటే మంచి ఆకాశం. అంటే శబ్దాన్ని కూడ దాటిపోయిన స్థితి. మంచి ఆకాశం అంటే బాగా సూక్ష్మమైనది, కాని ఇది కూడ ఆత్మలో నుండే వచ్చింది కనుకనే దానిని పొందాలని అనుకోవటం. అయితే అది కూడ సరిపోవటంలేదు. కాని ఉన్నవాటిలోకెల్లా అది మంచిది. మంచి వెధవ అన్నట్లు.

ఆత్మ సూక్ష్మంకంటే సూక్ష్మమైనది. అణోరణీయాన్ మహతో మహీయాన్. సర్వవ్యాపకమైంది. అది ఒక దేహంలో ఉంటే జీవాత్మ అన్నారు. స్థూలదేహం నశించినప్పుడు ప్రేతాత్మ అంటున్నాము రోల్డుగోల్డ్ అన్నట్లు. ఆత్మ అనంతమైనది.

- సశేషం

# సంత్ నామదేవ్ చరితామృతం

-మనోజ్ కుమార్

పిల్లకాలువలన్నీ పెద్దకాలువలలో, అవి నదులలో, ఆ నదులు సముద్రంలో కలవటానికి ప్రవహిస్తున్నట్లు అన్ని దిక్కులనుండి భక్తులు అళందివాసులతోసహా పంఢరి బయలుదేరారు. సావతామాళి, గోరాకుంభార్, చోఖామేళుడు కూడ పంఢరికి బయలుదేరాడు. కార్తీకం వచ్చింది. చంద్రభాగ తీరంలో భక్తి గంగకు వరద వచ్చింది. జ్ఞానదేవులు ఆనందంతో పాడుతుంటే జని భావసమాధిలోకి వెళ్ళింది. జని అంతరంగంలో విఠల సాక్షాత్కారం అయింది. పాండురంగడు విఠాయిమాతలా దర్శనం ఇస్తున్నాడు. భక్తులందరూ పిల్లలలాగ పాండురంగడిపైకి ప్రాకి ఎవరికి దొరికిన స్థానాలలో వారు కూర్చుంటున్నారు. జ్ఞానదేవులు నివృత్తినాధులతో 'గురుమహరాజ్! మిఠాయి పంచుతానని అందరినీ పిలిచి ఈమె సమాధిలోకి వెళ్ళిపోయింది' అన్నాడు. 'ఈమె ఏదో రూపకం చెప్తానంది. ఏమైంది?' ముక్త అడుగుతున్నది. రాజాయి అన్నది 'ముక్తా ! భక్తులు విఠలుడిమీద ఎక్కడెక్కడ ఎవరెవరు ఎక్కికూర్చున్నారో చూస్తూ పరవసిస్తున్నదేమో.'

జని తన విశాలమైన కళ్ళు విప్పార్చి అనుమతికోసం అన్నట్లు నామదేవుడివైపు చూసింది. నివృత్తినాధ్, జ్ఞానదేవులకు చేతులెత్తి నమస్కరించింది. ముక్తాబాయి ముఖాన్ని మృదువుగా నిమిరింది. తరువాత పాట అందుకున్నది. 'నా విఠలుడు పిల్లాపాపలు కలవాడు. ఆ పిల్లలు ఎంతో ముద్దు వస్తారు. ఆ పిల్లలు అతనిమీద ఇష్టం వచ్చినచోటల్లా ఎక్కి కూర్చున్నారు. నివృత్తి భుజాలమీద కూర్చున్నాడు. సోపాన్ ఆయన చేయి పట్టుకున్నాడు. జ్ఞానదేవుడు ముందు దారి తీస్తున్నాడు. వెనకాల ముక్త అందంగా అనుసరిస్తున్నది. గోరాకుంభార్ ఆయన తొడమీద ఉన్నాడు. చోఖా ఏకంగా ఛాతిపైన కూర్చున్నాడు. బంకా చంకనెక్కాడు. నామదేవుడు చిటికెన వేలు పట్టుకున్నాడు. జని ఈ సుందరదృశ్యాన్ని చూస్తూ మైమరచిపోయింది. విఠలుడు ఈ పిల్లలతో కలసి పండుగ చేసుకుంటున్నాడు.'

నివృత్తినాధ్‌వారికి ఆనందాశ్రువులు ఆగటంలేదు. అందరూ మనో నేత్రంతో ఆ సుందర దృశ్యాన్ని తిలకించి, పులకించి పాడారు. బిడ్డలందరికీ పాండురంగడు విఠాయి మాతృవాత్సల్యపూరితమైన స్పర్శానుభూతిని ప్రసాదించి వారందరినీ కృపాదృష్టులతో తనివితీరా చూశాడు.

ద్వాదశినాడు సాయంత్రం విష్ణుపదాలయంలో జ్ఞానదేవులు“నామా! ప్రస్తుతం సమాజంఅంతా వినాశనంవైపు పరుగులు తీస్తున్నది. గురుదేవుల ప్రసాదం వలన కలిగిన జ్ఞానాంజన శలాకతో భక్తిభావం అనే ప్రమిదలో ప్రేమ జ్యోతిని వెలిగించి ఆ వెలుగుతో సమాజంలోని చీకటిని పారద్రోలుదాం. జ్ఞానం, భక్తి అన్నసూత్రం చేపట్టి దానికి ప్రేమను జోడించి వర్ణాశ్రమాలకు ఒక క్రొత్త నిర్వచనాన్ని ఇద్దాం” అన్నారు. నామదేవులు“జ్ఞానదేవా! మీ జ్ఞానేశ్వరిని ఒక్కసారి శ్రవణం చేయాలని, ఆ భావార్థ దీపికలోని భావాలకు అభంగరూపం ఇవ్వాలని ఉన్నది. కాని అది గురుకృప వర్షించనిదే సాధ్యంకాదు. ఆ దృష్టితో నేను ఖచ్చితంగా అసంపూర్ణుడినే” అన్నాడు. జ్ఞానదేవుడు“అయితే అళందికి రండి. మీరు వస్తే అళంది పంఢరిగా మారుతుంది. నీవెక్కడ ఉంటే అదే పండరి” అన్నాడు. కాని నామదేవుడు మాత్రం “మనస్సులో కోరిక అయితే తీవ్రంగా ఉన్నదికాని విఠలుడిని వదలి రాలేను” అన్నాడు. “అయితే ఇక విఠలుడి అనుజ్ఞ తీసుకోవలసిందే; పిల్లలను బయటికి తీసుకెళ్ళాలంటే వాళ్ళ పెద్దల అనుమతి పొందాలికదా” అన్నాడు జ్ఞానదేవుడు. నామదేవుడు“వాడు నీమాట కాదనలేక అనుమతి ఇచ్చినా, నేను అతన్ని వదలి రావాలికదా! అది ఇప్పట్లో సాధ్యమయ్యేదికాదు.” జ్ఞానదేవుడు మనస్సులో అనుకున్నాడు, పూర్ణ సత్యం విఠలుడు ఇంకా నామదేవునికి అనుగ్రహించలేదు. ఒక చిరునవ్వునవ్వుకుని, “నామా! నీవు భక్తరాజువు. ఇంతటి భక్తి ఈ యుగంలో ఎవ్వరికీ సాధ్యమయ్యేది కాదు. నీ భక్తిలాంటి భక్తి, నీ ప్రేమ దృష్టి మాకూ కలగాలని నా వాంఛ. నీవు విఠలుడిని ఏ దృష్టితో చూస్తావో మాకు వినిపించవా” అడిగాడు.

“ నాకు అన్ని తీర్థాలు విఠలుడే, అన్ని క్షేత్రాలు విఠలుడే..........”

నామదేవుడి కీర్తన విన్న ముక్తాబాయికి అతనిపైన అపారమైన కరుణ కలిగింది. నామదేవుడి విఠలభక్తి మెచ్చదగినదేకాని అతడు భక్తిమార్గంలో నడిచే ఒక సాధకుడు మాత్రమే. అతనికి పూర్ణత్వం ఇంకా లభించలేదు. అతనికి, విఠలుడికి మధ్యఉన్న ద్వైతం ఇంకా పోలేదు. అతనికి సద్గురుదేవుల కృప కలిగితేకాని అద్వైతానుభూతి సిద్ధించదు. సద్గురుదేవుని కోసం తీవ్రంగా ఆవేదన కలగనిదే సద్గురుదేవుల దర్శనం ఎలా కలుగుతుంది? ఆయన కృప ఎలా కలుగుతుంది? నామదేవుడి మనసుకు కష్టం కలిగినాసరే, అవసరం అయితే కాస్త కటువుగా అయినా సరే మాట్లాడి, తనే అతనిలో సద్గురు ప్రాప్తికి

తీవ్ర ఆవేదన, పిపాస కలిగించాలి అనుకున్నది. జ్ఞానదేవులు తమలోతాము నవ్వుకున్నారు.

ఇంద్రాయణి తీరంలో సిద్ధేశ్వరద్వీపం. పున్నమి చంద్రుడు పుచ్చపువ్వులా వెన్నెలలు విరజిమ్ముతూ నడినెత్తిపైకి వచ్చాడు. జ్ఞానదేవుడికి నామదేవుణ్ణి చూడాలనిపించింది. నివృత్తినాథుల అనుజ్ఞతో జ్ఞానదేవుడు సమాధిస్థితిలోకి వెళ్ళాడు. అతని సూక్ష్మ శరీరంలోనించి పిల్లనగ్రోవి ఊదుతూ వాసుదేవ్ ఆవిర్భవించాడు.

నామదేవుడికి నిద్రలోనే ఆ పిల్లనగ్రోవిపైన పాడుతున్న మధురమైన రాగం వినిపించింది. నామదేవుడు చూస్తుండగానే వాసుదేవ్ విఠలుడిగా మారాడు. మళ్ళీ అంతలోనే వాసుదేవ్‌గా మారి నామదేవుణ్ణి భుజాలపైన వేసుకొని ఆకాశమార్గంలో అళంది చేరాడు. సిద్ధేశ్వర ఆలయంవద్ద నామదేవుణ్ణి దింపి జ్ఞానదేవుడి కుటీరంవైపు నడిచాడు. అమృతానుభవం చదవటం ఆపి జ్ఞానదేవుడు, నివృత్తినాథ్ పారిజాత వృక్షం దగ్గరకు వచ్చి నామదేవుడికి నమస్కరించారు. అంతలో సోపానకూడ వచ్చి నమస్కరించాడు. ముక్తాబాయి మాత్రం ఏమాత్రం మర్యాదచూపకుండా అలాగే నిలుచునిఉన్నది. జ్ఞానదేవుడు గూఢంగా నవ్వుకుని "అదేమిటి ముక్తా! సాక్షాత్తు పాండురంగడే నట్టింట్లోకి నడచివస్తే, అలా మర్యాద, మన్నన లేకుండా నిలబడ్డావేంటి? వచ్చి పాదాభివందనం చేయి'' అన్నాడు.

ముక్తాబాయి అన్నది "నాకు అతనిలో పాండురంగడు ఎక్కడా దర్శనం ఇవ్వటంలేదు. నిరంతర విఠల సాంగత్యం లభించికూడా ఇంకా అతనిలో నేనొక భక్తుడిని అన్న అహంకారం చావలేదు. మీవంటి మహా సిద్ధపురుషులతో నమస్కారం పెట్టించుకున్న వాడికి ఏం అర్థం అవుతుంది? సూర్యుడిని చూడటానికి దీపం సహాయం కోరేవాడికి, కల్పతరువు క్రింద నిలబడికూడా భిక్షాపాత్రనే కోరుకునేవాడికి నమస్కరించటంలో అర్థంలేదు.''

నామదేవుడి అహం దెబ్బతింది. కోపంతో మనస్సు దహించుకుని పోతుంటే అన్నాడు "మిమ్మల్నిమీరు ఏదో మహాజ్ఞానులము అనుకుంటున్నారు. కాని నేను నా భక్తితో పాండురంగణ్ణే వశంచేసుకొని నావాణ్ణిగా చేసుకున్నాను. నాపాదధూళి సోకితేచాలు, తమ వంశం పావనం అవుతుందని, నాభక్తి మహిమ తెలిసి జనమంతా నాకు నమస్కరించి నా పాదధూళిని శిరస్సున ధరిస్తారు.''

- సశేషం

# గురుకృప

-శివ ప్రసాద్

(శ్రీమదాంధ్ర మహాభారతమునందలి అశ్వమేధ పర్వములోని గౌతముడు, అహల్య, ఉదంకుడు, మిత్రసహుడు, మదయంతి అనే పేర్లు, ఈ కథలోని గౌతముడు, అహల్య, ఉదంకుడు, మిత్రసహుడు, మదయంతి అనే పేర్లు ఒకటే అయిన, ఈ కథలోని గౌతముడు శ్రీగురుదేవులందరికీ, అలాగే ఆది పర్వంలోని పైలుడికికూడా ప్రతీక. అహల్య గురుపత్నులందరికి, ఆది పర్వమందలి ఉదంకోపాఖ్యానంలోని పైలపత్నికి కూడ ప్రతీక. ఈ కథలోని ఉదంకుడు సచ్ఛిష్యులందరికి, ఆదిపర్వంలోని ఉదంకోపాఖ్యానంలోని ఉదంకుడికి కూడ ప్రతీక. అలాగే మిత్రసహుడు, మదయంతి పౌష్యునికి, పౌష్యమహాదేవికి కూడ ప్రతీకలు. ఈ కథలోని తక్షకుడు ఆది పర్వం ఉదంకోపాఖ్యానంలోని తక్షకునికేగాక అశ్వమేధపర్వంలోని ఐరావత సంతానమైన సర్పాని కూడ ప్రతీక. అశ్వమేధ పర్వంలో ఉదంకుడి కథలో ఇంద్రుడు మర్త్యులకు అమృతం ఇవ్వటానికి వీలుకాదు అని శ్రీ కృష్ణుడితో అంటాడు. అందువలన ఆది పర్వం ఉదంకోపాఖ్యానంలోని గోమయ భక్షణంలో, దానికి గురుదేవులు ఇచ్చిన వివరణలో అవసరమైన మేరకు ఈ కథలో కొద్దిగా మార్పు చేయటం జరిగింది. ఆది పర్వంలో గురుపత్ని కోరిన కోర్కె ఈ కథలో అహల్య కోరినట్లు, ఆదిపర్వంలోని, అశ్వమేధపర్వంలోని ఇద్దరు ఉదంకులకు కలిగిన అనుభవాలు అన్నీ ఈ కథలోని ఉదంకునకే కలిగినట్లు, ఆది పర్వంలోని ఉదంకుడికి పౌష్యమహారాజుతో జరిగిన సంవాదము ఈ కథలో ఉదంకునకు మిత్రసహునకు మధ్య జరిగినట్లు, ఆది పర్వంలో ఉదంకుడు అహిపతులను గూర్చి చేసిన పార్థన ఈ కథలోని ఉదంకుడు చేసినట్లు ఈ కథలో చెప్పబడింది.

ఉపాధి దృష్ట్యా గురువులు వేరువేరుగా(పైల, గౌతముల వలె) కనిపించినా గురుతత్వం ఒక్కటే. తత్త్వతః వారందరిలో ఏకత్వమే ఉన్నది. అలాగే ఉపాధిదృష్ట్యా శిష్యులు వేరువేరుగా(పైల, గౌతమ శిష్యులు ఉదంకుల వలె) కనిపించినా సచ్ఛిష్యత్వం, గురుభక్తి ఒక్కటే. ఈ దృష్టితోనే వైశంపాయనుడు జనమేజయునకు చెప్పిన ఉదంకోపాఖ్యానము, వైశంపాయనుని వద్ద విని రోమహర్షణి, ఉగ్రశవసుడు అయిన సూతుడు శౌనకాది మునులకు చెప్పిన ఉదంకోపాఖ్యానము రెంటిని మేళవించి, ఉపాధి దృష్యా ఇద్దరు గురువులు వర్షించిన గురుకృపను తత్త్వస్వరూపులైన ఒకే గురుదేవుడు వర్షించినట్లు, అలాగె ఉపాధి దృష్ట్యా వేరువేరుగా కనిపిస్తున్న శిష్యులకు ఎదురైన పరీక్షలు, అనుభవాలు తత్త్వతః సచ్ఛిష్యత్వానికి, గురుభక్తికి రూపమైన ఒకే శిష్యుడికి ఎదురైనట్లు చెప్పటం వరకు, పరస్పర వైరుధ్యాలకు సమన్వయం కుదర్చటం వరకు కథలో కల్పన చోటు చేసుకుంది. పాఠకులు ఈ మార్పులను సహృదయంతో స్వీకరించి ఆనందించ గలరని ప్రార్థిస్తూ......... కథలోకి వస్తాను. -శివ ప్రసాద్)

**గౌత** - (ముఖంలో ఆందోళన కనిపిస్తుండగా) అయ్యో దేవీ! తెలియక ఎంత అపచారం జరిగిపోయింది. సౌదాస నరేంద్రుడైన మిత్రసహుడు ఇప్పుడు బ్రాహ్మణశాపం వలన నరమాంస భక్షకుడై ఘోరరాక్షసుడిగా సంచరిస్తున్నాడు. మానవమాత్రుడెవడైనా ఆ ఛాయలకు వెళితేచాలు, వాళ్ళని చంపితినేస్తున్నాడు. ఉదంకుడికి ఈ విషయం తెలియక అతని వద్దకు బయలుదేరాడు. ఇప్పుడేమౌతుందో?

**అహ** - స్వామీ! నా వలన ఎంత పొరపాటు జరిగిపోయింది! నేను తెలియక చేసిన అపరాధాన్ని మన్నించండి. గురుపత్నిని సంతృప్తి పరచాలని, గురుదక్షిణ సమర్పించుకోవాలనే సత్సంకల్పంతో బయలుదేరిన మీ ప్రియ శిష్యుడు ఉదంకుడికి ఏ కీడు కలగకుండా కాపాడండి.

**గౌత** - విచారించకు దేవీ! అంత భయమెందుకు? నా ప్రియ శిష్యుడు ఉదంకుడు అంటే నాకు మాత్రం కరుణ లేదా? అటువంటి గురుభక్తి పరాయణుణ్ణి నేను మాత్రం సర్వదా కంటికి రెప్పలా కాపాడకుండా ఉంటానా? కంటికి రెప్పపడటంలోనైనా ఆలస్యం ఉంటుందేమోగాని గురుకృప విషయంలో ఆ మాత్రం ఆలస్యం కూడా ఉండదు. అనుక్షణ శిక్షణ పరీక్షా దక్షణ దీక్షా దక్షుడు, విశ్వచక్షువు అయిన గురుదేవుడు అతనిని ఎక్కడ ఉన్నా కనిపెట్టి చూస్తూ ఉండడా? కానీ దేవీ బంగారాన్ని అగ్నిలో శుద్ధి చేస్తే గాని దాని మెరుగు పెరగనట్లు శిష్యుడు గురుదేవుడు లీలగా కల్పించే పరీక్షలలో ఉత్తీర్ణుడైనప్పుడే అతని గొప్పతనము ప్రపంచానికి తెలుస్తుంది. గురుకృప అతనికి అన్ని విధాలా సహాయంగా ఉండి ఆ పరీక్షలలో అతడు ఉత్తీర్ణుడవటానికి కావలసిన సహాయాన్ని అందిస్తుంది.

**అహ** - ధన్యురాలను మునీంద్రా! ఉదంకుడు క్షేమముగా తిరిగివచ్చుగాక!

ఉదంకుడికి తను ఇంకా ఎంత దూరం వెళ్ళాలో తెలియటంలేదు. నాలుగోరోజు నాటికి తను ఆ మదయంతీ దేవీ ధరించే కుండలాలను తెచ్చి గురుపత్నికి సమర్పించ గలడా! అతనికి ఏమీ పాలుపోవటం లేదు. మనసారా గురుదేవుణ్ణి తలచుకున్నాడు. అంతలో అక్కడికి ఒక దివ్య పురుషుడు ఒక మహోన్నతమైన వృషభంపైన కూర్చుని వస్తూ కనిపించాడు. అతడు ఉదంకుణ్ణి చూస్తూనే.......

**దివ్య పురు** - ఉదంకా నీ గురుభక్తికి మెచ్చి నీకు సహాయం చేయాలనిపిస్తున్నది. నీవు నీ గురుపత్నికోసమై మదయంతీ దేవి కుండలాలను అర్థించటానికి

మిత్రసహుడి కోసం బయలుదేరావు కదా? ఇలా ప్రయాణిస్తే నీవు అక్కడికి ఎప్పుడు చేరేటట్లు? కుండలాలు తీసుకొని నీ గురుపత్ని వద్దకు తిరిగి చేరేది ఎప్పటికి? ఇది నాలుగు రోజులలో సాధ్యమేననుకుంటున్నారా?

**ఉదం -** మహాత్మా మీరెవరో సర్వజ్ఞులు. దయచేసి గురుకార్యార్థినైన నా యత్నం సఫలం అయ్యే మార్గం చెప్పండి.

**దివ్య పురు -** అయితే ఈ దివ్య వృషభం గోమయాన్ని భక్షించుము.

**ఉదం -** అయ్యా! చూస్తూ చూస్తూ ఈ వృషభ గోమయాన్ని ఎలా భక్షణ చేసి అశుచినయ్యేది?

**దివ్య పురు -** అయితే ఈ దివ్య వృషభం గోమయాన్ని నీ ముఖానికి, పాదాలకు పూసుకొని కళ్ళు మూసుకో. నీవు వెంటనే మిత్ర సహుని చేరగలుగుతావు.

ఉదంకుడు అలాగే చేశాడు. అతడు కళ్ళు తెరచే సరికి ఎదురుగా ఆ దివ్య పురుషుడు లేడు. చేతిలో గోమయం కూడా లేదు. అతడికి తను ఆ గోమయాన్ని భక్షించాను అన్న భావన మనస్సులో కలిగింది. అంతలో ఒక కర్కశమైన స్వరం వినిపించి అటు తిరిగి చూశాడు. అతడక్కడ మనుష్య రక్తం పులుముకున్న ఒడలితో, బండి చక్రములవంటి కనులతో, మిడిగుడ్లతో, కోరమీసములతో, పెద్దపెద్ద కోరలతో అతి భయంకరాకారంతో ఉన్న మిత్రసహుని చూశాడు. ఉదంకుడు తనను చూసిన సమయంలోనే మిత్రసహుడు కూడా ఉదంకుడిని చూశాడు. ఉదంకుడికి దివ్య పురుషుడు చెప్పిన మిత్రసహుడు ఇతడే అన్న సౌంజ్ఞ కలిగింది.

**మిత్ర సహ -** (లొట్టలేస్తూ) బాగా ఆకలి వేస్తున్నది. ఇప్పటికే ఆహారం కోసం చాలా శ్రమపడి, ఆహారం ఎక్కడ దొరుకుతుందా అని ఆశగా అన్ని వైపులా చూస్తున్నాను. ఇంతలో నీవు సరిగ్గా సమయానికి వచ్చావు. ఇక ఆకలికి తాళలేను. వెంటనే నిన్ను భక్షించి నా ఆకలిని తీర్చుకుంటాను.

**ఉదం -** ఓ రాజా! నేను గురుకార్యం కోసం నీ దర్శనార్థం వచ్చానయ్యా. గుర్వర్థరతులను హింసించరాదు. వారు అవధ్యులు. ధర్మము అలా చెప్తుంటే నీవు ఇలా అధర్మంగా మాట్లాడవచ్చునా!

**మిత్ర సహ -** ఓ భూసురోత్తమా! దినములో మూడవయామంలో అపరార్ధం నాకు ఆహారం స్వీకరించటానికి యోగ్యమైన సమయంగా దేవతలు నిర్ణయించి పెట్టారు. నీవు సరిగ్గా ఆ సమయంలో వచ్చావు. అందువల్ల నిన్ను విడిచిపెట్ట జాలను. తప్పక భక్షించి తీరతాను. -సశేషం

# శ్రీకృష్ణ కర్ణామృతం

- సుశీలా ప్రసాద

**శ్లో॥ మధురతర స్మితామృత విముగ్ధ ముఖాంబురుహం**
**మదశిఖిపించ లాంఛిత మనోజ్ఞ కచప్రచయమ్**
**విషయ విషామిషగ్రసన గృధ్నుని చేతసిమే**
**విపుల విలోచనం కిమపిధామ చకాస్తి చిరమ్॥**

సమస్త విశ్వాన్ని సృజించి. **"అహం బీజప్రదః పితః, మయాధ్యక్షేణ ప్రకృతిz స్సూయతే సచరాచరమ్",** అని **"పితాz హమస్య జగతః మాతాధాతా పితామహః"** అని ప్రకటించుకున్న పరమాత్మతో సృష్టిలోని ప్రాణినైన నాకూ తనకూ తండ్రి బిడ్డల సంబంధమున్నదిగదా! సర్వేశ్వరుడైన నా తండ్రి సుగుణాలను చెప్పుకోవాలంటే, సాధుహృదయ సరోవరాలలో వికసించిన విజ్ఞానమే బంగారు తామరపూలు కాగా, వారి ఆనందానుభూతుల సారమే తామరతూడులయి, అవి ఆరగించే రాజహంస నా తండ్రి. మహాత్ముల మానస కమలాలలోని భక్తి అనే మకరందాన్ని తనివితీరా గ్రోలే తుమ్మెద తాను. మరి నేను? విషయాలనే విషం కలిసిన దేహభ్రాంతి అనే మాంసాన్ని తినాలని ఉత్సహించే హీనగుణం నాది.

ఎల్లరనూ ముగ్ధులను చేసే లోకేశ్వరుని ముఖారవిందంలోని మధురాతి మధురమైన చిరునవ్వులో ప్రేమామృతం నిండి ఉంటుంది. అది తిలకించిన ధన్యులకు భగవద్వియోగ దాహ శాంతి, భవతాప శమనమూ కలుగుతాయి. నా నవ్వులో ఎదుటి వారిని మోసం చేసే కుటిలత్వం నిండి ఉంటుంది. కరుణారస సింధువులైన నా తండ్రి కనుల కడగంటి చూపు తాకితే తననాశ్రయించినవారి మనస్సులను మాలిన్య రహితం చేస్తాయి. నా కళ్ళు చూస్తున్న ప్రతి వస్తువూ శాశ్వతమని భ్రమిస్తూ, అవి పొందలేక పోతే వ్యర్థమైన కన్నీరు కారుస్తుంటాయి. ఎంత దూరాన ఏ ఆపదలో ఉన్నా దీనుల ఆర్తనాదాలు విశ్వవ్యాప్తమైన జగదీశ్వరుని శ్రవణేంద్రియానికి సోకి ఆ క్షణమే వారికి రక్షణ లభిస్తుంది.

నా చెవులు? భగవన్నామ గుణకీర్తనలు, సద్విషయ విచారణలు వినటానికి విముఖములై లౌకిక విషయ శ్రవణమునందు ఆసక్తి కలిగి ఉంటాయి. ఈ విధంగా విషయలోలమైన నా చిత్తాన్ని జగదోద్ధారణ తారణ కారణ లీలావతారుడైన నా తండ్రి భ్రమర కీట న్యాయంగా వ్యవహరించి ఉద్ధరించ దలచాడు.

"వ్యాకులపరిచే లౌకిక విషయాలనే ఆకులలములు తింటూ, రోత కలిగించే దేహంతో కీటకమై ఎందుకు బ్రతుకు వ్యర్థం చేసుకుంటావు? భగవచ్చింతనామృత పానంతో బ్రహ్మానందం పొందగల భ్రమరమువై ప్రకాశించు" అంటూ తన దివ్య చరణారవిందమనే గూటికి, తన దయ అనే బంక మట్టితో నా మనస్సుని అంటించాడు. తుమ్మెద ఝుంకరిస్తూ కీటకాన్ని పొడిచినట్లుగా ఓం అనే ప్రణవాన్ని వినిపిస్తూ 'తత్త్వమసి' అది నీవై ఉన్నావనే ఆత్మతత్త్వాన్ని తెలుపుతూ ఒక పోటు, నీలోపల, వెలుపల అంతటా నిండి ఉన్న చైతన్యం ఆప్రజ్ఞానమే బ్రహ్మ అది తెలుసుకో మంటూ మరో పోటు పొడుస్తూ ఉంటే, నిజమే ఏది నేను అని తెలుసుకోవాలో ఆ బ్రహ్మ స్వరూపమే నేను 'అయమాత్మాబ్రహ్మ' అనే స్థితికి చేర్చి మునుపు అజ్ఞానంతో దేహమే నేను అనుకునే వికార రూప బుద్ధిని తొలగించి, 'అహంబ్రహ్మాస్మి' సర్వే సర్వత్ర నిండి ఉన్న ఆత్మ వస్తువుని నేను నాకంటె వేరైనది లేదు అనే దివ్య తత్త్వానుభవ మకరందాన్ని గ్రోలే భ్రమరరూపంగా మార్చాడు. అందువలనే ఇంతటి దయ నాపై కురిపించిన, ఎల్లరనూ ముగ్ధులను చేసే మధురతరమైన చిరునవ్వు అనే అమృతం నిండిన వదనారవిందము, అందమైన జుట్టుముడిలో తాను స్వామి అనుగ్రహాన్ని పొంది ఉన్నత స్థానాన్ని అలంకరించాననే మహదానంద పరవశమైన నెమలిపింఛము, విశాల వినీల నయనాల నుండి వెలువడే చల్లని చూపులు గల సాకారబ్రహ్మము నందగోపబాలుడైన ఆ పరమాత్మ అఖండ జ్యోతి స్వరూపం నా మనస్సులో చిరకాలం ప్రకాశిస్తూనే ఉంది.

-సశేషం

# మౌనధ్యాన సప్తాహశిబిరం

(గత సంచిక తరువాయి) -రమణ ప్రసాద్

భాగవతంలో వేదాంతం అంటే అదే. భక్తితో రంగరించినది ఉదాహరణకు ప్రహ్లాదుడు తండ్రితో

**ఇందుగలడందులేడని,**
**సందేహము వలదు చక్రి సర్వోపగతుం,**
**డెందెందు వెదకి చూచిన,**
**నందందే కలడు దానవాగ్రణి వింటే**

అన్నాడు. అందుకని వెతికి చూడాలి. Understand!
భగవంతుడు ఎక్కడ ఉన్నాడో వెతికి చూడాలి. understand? మనకు ఏమి తక్కువ చేశారు మన గురుదేవులు? కొన్ని కొన్ని సన్నివేశాలు తల్చుకుంటే బాధవేస్తుంది. ప్రహ్లాదుడు తండ్రియైన హిరణ్యకశిపునితో

**అచ్చపు జీకటింబడి గృహవ్రతులై విషయ ప్రవిష్టులై**
**చచ్చుచు బుట్టుచున్ మరల జర్వితజర్వణులైనవారికిం**
**జెచ్చరబుట్టునే పరులు సెప్పిననైన నిజేచ్ఛనైన నే**
**మిచ్చిననైన గానలకు నేగిననైన హరి ప్రబోధముల్**

అంటాడు. స్వామివారు చెయ్యి చూపించి నువ్వు చూడు అంటే, ఆ వెలుగును మనం ఎంతవరకు చూస్తున్నాము? ఆ వెలుగును ఎంత ఉపయోగించుకుంటున్నాము? అచ్చపు చీకటిలోపడి మేను నేనుగా తలచే మానవులు **గృహవ్రతులై విషయప్రవృత్తులై జచ్చుచుబుట్టుచున్** మరల చర్విత చర్వణులైనవారు అయితే ఏమిటట? చస్తే చస్తాం అంటారు. ప్రతి రోజు ఒకసారి చచ్చి పుడుతున్నాం. రాత్రి నిద్రపోవటం తాత్కాలిక చావే. ఆ నిద్రలోనే హరిఃఓం తత్సత్ అయితే? విషయాలలోపడి అనుకున్నదే అనుకునేవారికి చెచ్చెరబుట్టునే నిజేచ్ఛనైన - మన అంతరాత్మ బోధ చేస్తూ ఉంటుంది. దైవత్వమనే అనుభూతి స్వతహాగా రావాలి. ఒక యాక్టర్ డబ్బుకోసం వేషం వేస్తాడు. అంతమాత్రం చేత తన పేరు మరిచిపోతాడా? కానలకు ఏగిననైన - ఇంట్లో కోపం వచ్చి అడవులకు వెళ్ళేవాడు చిన్న రొట్టెముక్కకోసం ప్రాకులాడతాడు.

ప్రబోధ - బోధ మహాత్ముల దగ్గరనుంచి వచ్చిన తత్త్వం, వారివి అనుభవంతో ఉన్న మాటలు. వాటిని అందుకోవాలంటే ధ్యానం తోడ్పడుతుంది. ధ్యానం నీ స్వరూపం. అది నీలోనే ఉన్నది. కారు డ్రైవ్ చెయ్యటం గమ్యం చేరటానికే కదా! అలాగే ధ్యానం నీ గమ్యం చేరుకోవటానికే. నువ్వు చూస్తూ

నడుస్తున్నావు, అది ధ్యానమే. కూర్చున్నావు, అది ధ్యానమే. ఇవి తాత్కాలిక సుఖాలను ఇస్తాయి, కాని చివరకు మిగిలేది దుఃఖమే. ఒకరు గృహ ప్రవేశం చేసినప్పుడు పెద్దగిన్నెలో కొద్దిగా పాలు పెట్టారు. అవి ఎలా పొంగుతాయి?

ఒక గురువు దగ్గర అనేకమంది శిష్యులు ఉన్నారు. ఒక శిష్యునితో "ఒరేయ్! నువ్వు చాలా తప్పు చేశావు?" దానికి శిష్యుడు " నేనేమి తప్పు చేశాను?' అన్నాడు. "నువ్వు పుట్టడమే ఒక తప్పు రా" అన్నారు గురువుగారు.మళ్ళీ జన్మ లేకుండా చేసికోవాలంటే right path లోకి రావటానికి ప్రయత్నం చెయ్యి. మనం ధ్యానం చేస్తూ కాలు కదిపితే, మన ప్రక్కవాడుకూడా కాలు కదిపితే అదొక satisfaction / (తృప్తి). నా మనస్సు సరైన మార్గంలో ఉన్నదా? అని ఎవరికి వారు విచక్షణ చేసికోవాలి. భగవద్గీతలో -

**ఉద్ధరేదాత్మనాZZత్మానం నాత్మాన మవసాదయేత్ ।**
**ఆత్మైవహ్యాత్మనో బన్ధురాత్మైవ రిపురాత్మనః ॥** భగవద్గీత6 / 5

తనను తానే ఉద్ధరించుకొనవలెను. తనను తాను చెరుపుకొనరాదు. తనకు తానే బంధువు. తనకు తానే శత్రువు, అంటాడు భగవానుడు.

గురుదేవులు ఆనందించే కీర్తనలలో 'గురుదేవా జయదేవా'ఒకటి. వారు సాక్షాత్ దైవ స్వరూపులు కాబట్టి వారు అలా ఆనందించటం మనం మరీ మరీ చెప్పుకోవటం కోసమే. మనం తెలియక తప్పులు చేస్తుంటే వారు మనలను సరిదిద్ది సరైన మార్గంలో నడిపిస్తున్నారు.

**హే దయామయ ఆప్‌హీ సంసార్ కే ఆధార్ హో ।**
**ఆప్ హీ కర్తార్ హో హమ్ సబ్‌కె పాలన హార్ హో ॥**

స్వామివారు ఈ కీర్తనను ఎంత తీరుబడిగా పాడించే వారంటే - 'హే దయామయ' అనే పదం ఒక్కొక్క అక్షరం భావయుక్తంగా నెమ్మదిగా... పాడించేవారు. 'ఆప్‌హీ' అన్నాడు.భక్తుడు 'నువ్వే ఈ సంసారానికి ఆధారుడివి అన్నాడు. ఆ దయామయుడు ఎవరు? మనకు మన గురుదేవులే!

తత్త్వం కాలాతీతమైనది. జీవితం కాలంతో ముడిపడి ఉన్నది. నువ్వు పడుకోవాలంటే నిద్ర పడుతుందా? నీ జీవితమే నీ మాట వినటం లేదు. ఈ రోజు ఉపవాసం చేయాలి అంటే ముందే బాగా ఆకలి వేస్తుంది.

**జనమ జనమకే పాపకేకారణ శిక్షా మేరి మంజూరు హుయీ మరణ్ ।**
**మానో హర్ ఎక్ క్షణ్ అంతిమ క్షణ్ మనసా వాచా కరూ తెరె స్మరణ్।**

పుట్టడం మన చేతిలో లేదు. అది ప్రకృతి పరమాత్ముల లీల.మన పతి గతి ఆయనే. ఆ జగన్నాధుడే. ఆయనకు మార్పు లేదు. ప్రాణ్‌హో - మన ప్రాణం ఆయనే. మన దృష్టిని ఏకాగ్రత చేయటానికి ఎన్ని బాధలు పడుతున్నాడు?

వారిది పరమాత్మ దృష్టి. మనది ప్రపంచ దృష్టి. భగవంతుని వద్దకు చేర్చేదే పరమాత్మ దృష్టి.

**శాంతి సుఖ్‌కా సార్ పాసకతే నహీ** - కప్పులో అమృతం ఉంది. భావన చెయ్యి. అందులో పడితే మరణిస్తామా? మరణించం. ఎందుకంటే అది అమృతం కాబట్టి. ఆదృష్టిలో ఉంటే సమయం తెలియదు. అప్పుడు మనం ఏమైనా మనం ధన్యులమే.

**దీజియే వహ మనతి బనే హమ్ సద్గుణీ సంసార్ మే**
**మన్‌హో మంజుల్ ఔర్ ధర్మమయ ఔర తన్ లగే ఉపకార్‌మే**

ఉపకారం చేసే భావనతో సేవచేసే భాగ్యం నాకు ప్రసాదించు ప్రభూ! ఇప్పుడు చెప్పండి. మనం చేసే సంకీర్తన ధ్యానం కాదా? మనఆత్మకు నచ్చినవాడు మన గురుదేవుడు. అందులో ఉన్నవాడూ ఆయనే. మనకు ఇంత శక్తిని భక్తిని ఇచ్చి తమ బోధల ద్వారా మనలను అక్కున చేర్చుకొనే నాధుడు ఆయన! ఆయనను శరణు వేడుదాం.

**గురు దేవా జయ దేవాశరణు శరణు సద్గురు దేవా ।**

-సశేషం

## ఉచిత వైద్య శిబిరం

"భక్తి, సామాజిక సేవ మిళితం కావాలి" అని శ్రీ బాబు చేసిన బోధనసరించి, శ్రీ కాళీగార్డెన్స్ ఆశ్రమ ట్రస్టు హాస్పటిల్ వారు పశ్చిమ గోదావరి జిల్లాలో వైద్య శిబిరం నిర్వహించి, ఉచిత వైద్య సేవలు అందించారు.

25-8-2009న పెదనింద్రకొలను గ్రామంలో నిర్వహించిన శిబిరంలో వైద్యులు సుమారు 400మంది రోగులను పరీక్షించి, మందులు ఉచితంగా పంచారు. ఈ శిబిరంలో సుమారు 300మందికి హెపటైటిస్-బి వాక్సిన్ ఇచ్చారు.

27-8-2009న నిడమర్రు గ్రామంలో నిర్వహించిన శిబిరంలో సుమారు 550మంది రోగులను పరీక్షించి, ఉచితంగా మందులు పంచారు. సుమారు 250మందికి హెపటైటిస్-బి వాక్సిన్ ఇచ్చారు.

# మాతాజీ బోధామృతం

- శివ ప్రసాద్

ఇక కేదార్‌కు వస్తాను. ఏదో ఇన్‌ఫ్లూయన్స్(influence)తో హెలికాప్టర్ ఎక్కటానికి హెలిపాడ్ దగ్గరకు వెళ్ళాము. దానిగాలి మమ్మల్ని ఎగరగొట్టేంతగా ఉన్నది. మనం పట్టుకున్న పాదాన్ని గట్టిగా పట్టుకుంటే, ఏ విషయాల సుడిగాలులూ మనలను సడలింపచేయలేవు, చలింపచేయలేవు అనిపించింది. మేము కేదార్ వెళ్ళేసరికి 12గం. 30నిలు అయింది.

అసలు ఏమీ తెలియని మేము, అన్ని క్షేత్రాలను, తీర్థాలను దర్శనం చేసుకొని, యాత్ర బాగా పూర్తిచేసుకొని సురక్షితంగా వెనక్కి తిరిగి వచ్చాము అంటే, అదంతా గురుకృప. ఆశ్రయమిచ్చిననాడే ఇది(దేహం) నీవుకాదురా, ఈ దేహానికి ఆధారమైనది ఒకటి ఉన్నది, అది నీవు, ఈ రెంటికి మధ్య తైతక్కలాడుతున్న మనస్సులోని వాసనలను గుర్తించటం ద్వారా వాసనారహితం చేసికో, అని ప్రేరణతో వస్తువును గుర్తించి, అది తెలియచేసేవాడే గురుదేవుడు.

ఇప్పుడు ఇక భక్తియోగానికి వద్దాం. సాకారోపాసన గొప్పదా? నిరాకారోపాసన గొప్పదా? అని అడిగిన అర్జునుడికి భగవానుడు నాయందు మనస్సు ఉంచి ఉపాసనచేస్తే, అది సాకారమైనదైనా, నిరాకారోపాసన అయినా ఏదైనా గొప్పదే అన్నాడు. నీవు ఎందులో అయినాఉండు. కాని దానిని గుర్తుంచుకొని లెస్సగా చెయ్యి. ఇలా మెల్లగా చెప్తూనే-

**క్లేశోऽధికతరస్తేషాం అవ్యక్తా సక్తచేతసాం।**
**అవ్యక్తాహి గతిర్దుఖం దేహవద్భి రవాప్యతే॥**

అని చెప్పాడు. నిర్గుణోపాసన దేహాభిమానం ఉన్నవాడికి కష్టం. దేహాభిమానం లేకుండా పోతేనే దానిని చేయగలవు. అందువలన దేహాభిమానం ఉంటే నీవు సాకారోపాసన చెయ్యి. మనం గురుదేవులు చెప్పినదానిని ఆచరిస్తూ, అవసరంకాని ప్రపంచాన్ని వదలిపెట్టిననాడు నిరాకారాన్ని పొందుతాము. **అత ఊర్ధ్వం న సంశయః.** అందులో సందేహంలేదు. నీ మనస్సును, బుద్ధిని, నాయందే నిలిపితే, నాయందే ఉంటే, నన్నే పొందగలవు అన్నాడు భగవానుడు. అర్జునుడి సందేహాలన్నిటికి సమాధానం ఇక్కడ వచ్చింది. భగవానుడు 'నా యందే ఉండిపోగలవు, **అత ఊర్ధ్వం న సంశయః**' అన్నాడు. ఉపాసన మనకు ఎంత దగ్గరగా ఉన్నది? మనం ఎంత దగ్గరగా

ఉన్నాము? నీ మనస్సు, బుద్ధిని ఉంచలేక పోతున్నావేమో, నీవే దూరంగా వెళ్ళిపోతున్నావు. దగ్గరగా ఉంచితే నీవే దగ్గరగా ఉన్నావు.

జ్ఞానం, ధ్యానం, కర్మఫలత్యాగము, ఒక్కొక్కటే చెయ్యి. అది చెయ్యలేక పోతేదానికోసం ప్రయత్నం చెయ్యి. అది కూడ చెయ్యలేకపోతే, నీ కర్మలన్నీ నాకోసం చెయ్యి. నాగుఱించి చెయ్యి. ఈ పూజాదికాలు చేస్తున్నామంటే, అది వారు చెప్పింది.

**శ్రేయోహి జ్ఞానమభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే।**
**ధ్యానాత్ కర్మఫలత్యాగః త్యాగాచ్ఛాంతిరనంతరమ్॥**

ఎన్నిసార్లు చెప్పుకున్నా, ఎంత ఆనందంగా విందామనుకున్నా, ఎప్పటిదాక చెప్పుకోవాలి? దేహాభిమానం చచ్చేవరకు చెప్పుకోవాలి. జ్ఞానాభ్యాసం కన్నా ధ్యానం గొప్పది. ధ్యానం కంటె కర్మఫలత్యాగం గొప్పది.

వర్షం వచ్చినా ఎండ వచ్చినా, బయట ఉన్నవాడికి బాధగా ఉంటుంది. బయట ఎండకాస్తున్నా, వర్షం కురుస్తున్నా మనం బృందావనంలో ఉన్నాము. అదే శాంతి. అందులో కదలకుండా ఉండు. భక్తులైనవాళ్ళకు 24 లక్షణాలను చెప్తాడు భగవానుడు. ఏ ఒక్కటి ఉన్నా నా భక్తుడే, కాని అది పూర్తిగా ఉండాలి.

**అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ।**
**నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖక్షమీ॥**

అద్వేష్టా మమ పుత్రస్య, మమపుత్రికాయాః అనలేదు. సర్వభూతానాం, అన్ని భూతములయందు అన్నాడు. మైత్రః కరుణ ఏవచ, నిర్మమో, నిరహంకారః, వీటన్నిటికీ సర్వ భూతములయందు, అన్నింటియందు అనేది తెచ్చిపెట్టుకోవాలి. సర్వలోకానాం కరుణఏవచ, సర్వలోకానాం నిర్మలః, అలా సమదుఃఖ స్సుఖక్షమీ. అంటే సుఖాన్నీ దుఃఖాన్నీ సమదృష్టితో చూడగలగటం. సమస్త ప్రపంచంమీద పడ్డాసరే పృథ్వివంటి ఓర్పుకలిగినవాడే సాధకుడు, భక్తుడు. భగవానుడు భక్తుడైనవాడు ఇంకా ఈ లక్షణాలన్నీ కలిగి ఉండాలి అని చెప్తున్నాడు.

**సంతుష్టస్సతతం యోగీ యతాత్మాదృఢ నిశ్చయః।**
**మయ్యర్పిత మనోబుద్ధిః యోమద్భక్త స్సమేప్రియః॥**

సంతుష్టస్సతతం యోగీ, అంటే ఎల్లప్పుడు సంతోషంగా ఉండటం, యోగిగా ఉండటం. యోగం అంటే, మనస్సును నిగ్రహించటం. యోగశ్చిత్తవృత్తి నిరోధకః అని పతంజలి యోగ సూత్రాలు చెప్తాయి.

ఎప్పుడూ సంతృప్తిగా ఉండేవాడు నాది, నీది అనేవాటినన్నిటినీ తగ్గించుకోవాలి. ఎక్కువ పెట్టుకుంటే అసంతృప్తి వస్తుంది. భగవద్విషయమైతే, దానితో సంగం భగవద్విషయకమైన సంతృప్తిని కలిగిస్తుంది. యతాత్మా దృఢ

నిశ్చయః. నిన్న అందరం ఎంతో అలసిపోయి ఉన్నాము, అయినా తెల్లవారుజామున మొదలుపెట్టి మహన్యాస పూర్వకంగా రుద్రాభిషేకము, యజ్ఞము, గురుపూజ, మొదలైన కార్యక్రమాలన్నిటినీ చేశామంటే, అదంతా దృఢనిశ్చయం మూలంగానే. నిజానికి అందరూ రెస్ట్(Rest) ఇస్తే పడుకోవాలనే ఉన్నారు. అయినా ఏ శక్తి నడిపిస్తోంది? అదే గురుశక్తి. ఆ దృఢ నిశ్చయమే వైరాగ్యానికి త్రోవ తీస్తుంది. మయ్యర్పిత మనోబుద్ధిః నీ మనోబుద్ధులను నాకే అర్పించు. అలా నాకే అర్పించిన ఏభక్తుడైతే ఉన్నాడో వాడే నాకు ప్రియుడు.

**యస్మాన్నో ద్విజతేలోకః లోకాన్నోద్విజతేచయః।**
**హర్షామర్ష భయోద్వేగైః ముక్తోయస్సచమేప్రియః॥**

ఎవరి వలన లోకం భయపడదో, లోకం వలన ఎవడు భయపడడో అని అర్థం. మన వలన ఎవ్వరూ భయపడకూడదు. దేనివలనా మనం దుఃఖపడకూడదు. అటువంటివాడు ప్రహ్లాదకుమారుడు. ఈ అన్ని గుణాలు ప్రహ్లాద కుమారుడిలో ఉన్నాయి. మహా భక్తుల పేర్లలో ప్రహ్లాద కుమారుడి పేరు మొదటనే ఉంటుంది.

**ప్రహ్లాద నారద పరాశర పుండరీక ।**
**వ్యాసాంబరీష శుకశౌనక భీష్మల్భ్యాన్ ।**
**రుక్మాంగదార్జున వసిష్ఠ విభీషణాదీన్ ।**
**పుణ్యానిమాన్ పరమభాగవతాన్ స్మరామి॥**

ప్రహ్లాదుడు దేనివలనా భయపడడు. అతని వలన ఏదీ భయపడదు. మనం ప్రపంచానికి భయపడతాం. మనల్ని చూస్తే అన్నీ భయపడతాయి. అటువంటప్పుడు మనం భక్తులకోవలోకి ఎలా వస్తాము? మనం ఆశ్రయించిన గురుపాదంలో ఎక్కడ అయినా భయం అనేది ఉన్నదా? ఎవరైనా దానిని భయపెట్టగలిగారా? ఎవరికైనా అదంటే భయం కలుగుతుందా? అది మనందరకు అభయం ప్రసాదించేది.

హర్ష, అమర్ష, భయ, ఉద్వేగములనుండి ఎవడు వదలి పెట్టబడి ఉంటాడో అట్టి భక్తుడు భగవానుడికి అత్యంత ప్రియమైనవాడు. ఆ భక్తుల లక్షణాలను మనం స్మరిస్తూ ఉంటే, గురుదేవులు మెల్లగా మనకు వాటిని ప్రసాదిస్తారు. కాని విషయవిమర్శ చేస్తే, తప్పులేనిచోట తప్పు ఉన్నదని నింద చేసేవాడు అవతలివాడి కర్మను తిసికొంటున్నాడు. ఎవ్వరికీ తలవంచమనలా. శ్రీగురుదేవుల చరణాలవిందములముందు తలవంచితే ఇక భయం ఎక్కడ?

మనం దగ్గరే ఉన్నాము. మన మనస్సే దూరం చేస్తున్నది. దగ్గరే ఉన్నామన్న గుర్తింపు తెచ్చుకొంటే సద్గురుదేవుల చరణారవిందములయందలి మకరందాన్ని మనం పొందవచ్చు. *

# మాతాజీ సత్సంగ్ డైరీ

(గతసంచిక తరువాయి) -రమణ ప్రసాద్

మనస్సు సద్విచారణలో ఉండాలి. అప్పుడు వివేక బుద్ధి కలిగి వైరాగ్యం వస్తుంది. మనం చేసే కర్మలలో సత్కర్మలు, దుష్కర్మలు రెండూ ఉంటై. సత్కర్మల వలన సుఖం కలుగుతుంది. దుష్కర్మలవలన దుఃఖం కలుగుతుంది. మానవుడు తెలిసీ కొన్ని దుష్కర్మలు చేస్తాడు. లాభాలకోసం కొంత గడ్డితింటాడు. బిజినెస్‌లో మోసం చేయవలసి వస్తుందని కొందరు బిజినెస్ చేయటానికి ఒప్పుకోరు. వ్యవసాయంలో అటువంటి ఇబ్బంది ఉండదని కొందరు వ్యవసాయం చేస్తారు. నీ కిష్టమైనవాటిని ఏర్పరచుకోవటానికి నీకు ఎక్కడి గంటలూ చాలటంలేదు. ఆ గంటలలో ఎప్పుడొస్తుందో ఆఖరుగడియ? అది చెప్పిరాదు. మరి మన జీవితం కోసం మనం ఏమి చేసికొంటున్నాము? రోడ్డు మీద వెళ్తున్నప్పుడు యాక్సిడెంట్ అయి చచ్చి పోకూడదని గ్యారంటీ ఏమైనా ఉన్నదా? లక్షలు పోసికొన్నకారును లేదా వేలకు వేలుపోసి కొన్న స్కూటర్‌ను పట్టుకొని సీల్ చేస్తే సుఖం ఏమౌతున్నది? అది బంధన ఇస్తోంది. చెయ్యినొప్పి బంధన ఇస్తోంది. హెడ్‌లైట్ వేస్తే హెడేక్(Headache) వస్తే అదీ బంధన అయింది. ఆ పనికిరాని హెడ్‌ను తీసి ఆయన పాదాల దగ్గర పడేయి. నీకు పనికిరాని హెడ్‌ను వారి పాదాల దగ్గర వదులుతానంటే వారు ఒప్పుకోరు. నాకు కావలసింది ఆ హెడ్‌కాదు, నీమైండ్ (Mind) కావాలిరా అంటారు. ఇన్నింటినీ ఆస్వాదన చేయగలిగేమైండ్ కావాలి అంటారు. అందుకని బాధ దేనివలన వస్తున్నది? అనిత్యమైన వాటివలన. చిన్నప్పటి ఫోటో చూసి, ఇప్పుడు యౌవనం పోయి వృద్ధాప్యం వచ్చింది అని బాధపడితే తిరిగి యౌవనం వస్తుందా? చిన్నప్పుడు రోగాలు లేకుండా ఎంత ఆరోగ్యంగా ఉన్నానో? ఇప్పుడు రోగం వచ్చింది అని బాధ పడితే రోగం తగ్గుతుందా? దానికి మందువేసుకోవాలి. పథ్యం చెయ్యాలి. మందువేసికొన్నా పథ్యం చెయ్యకపోతే లాభంలేదు. మనం దేనినైనా వివేక దృష్టితో పరిశీలించి అనుభవించాలి. వివేకంతో కూడిన దృష్టితో అడుగువేస్తే ఉన్న పవర్‌ను గుర్తించటమేకాక, ఆ పవర్‌ను గుర్తించిన వారిని మనం గుర్తించగలుగుతాము.

మనం ఎక్కడికీ కదలక్కర్లేదు. వడ్లగింజలో బియ్యపుగింజ. వడ్లగింజగా ఉన్నప్పుడు బియ్యపుగింజ కనిపించిందా? కనిపించదు. ఎవరు చెప్పారు అందులో బియ్యపుగింజ ఉన్నదని? ఆ బియ్యపుగింజకు రెండు పొరలు ఉన్నట్లే, మన మనస్సుకు కూడ అహంకారం, మమకారం అనే రెండు పొరలున్నాయి. మనకు ఆ పొరలను తొలగించుకోవటం దుర్భేద్యమే, కాని భగవన్నామం చేసేవారికి అది

తేలిక. అహంకారానికి పైలట్ మన కన్ను. కన్ను అహంకారానికి సెక్రటరీ అయితే, చెవి మమకారానికి సెక్రటరీ. కన్నులతో చూసింది బాగా మనస్సులో నాటుకొని బలంగా, దృఢంగా అవుతుంది. అది మన అహంకారాన్ని పెంచుతుంది. నేను చెవితో విన్నవి ఎవరైనా మెచ్చుకుంటే జై, కాస్త విమర్శిస్తే తొయ్యి. అటువంటి వాటిని వివేక దృష్టితో వినాలి. వివేక దృష్టితో అనుభవించాలి. వివేక దృష్టితో నీ జీవితాన్ని ముందుకు తీసికొని వెళ్ళాలి. భోగభాగ్యాల విషయంలో మనకంటె తక్కువవాణ్ణి చూసి భగవంతుడి దయవలన నాకు అతనికంటె ఎక్కువగా ఉన్నదిగదా అని సంతోషించాలి. ఆధ్యాత్మికతలో, మనకంటె ఎక్కువవారిని చూసి మనకు అవిలేవే అని, లేదా వారిలో లేని దుర్గుణాలను మనలో చూసి, మనం వాటిని ఇంకా ఎప్పుడు జయిస్తాము? వారు చేరిన స్థితికి మనం ఎప్పుడు చేరుకుంటాము? అనుకోవాలి. మహాత్ములు పడిన కష్టాలతో పోలిస్తే మనకు కలుగుతున్న కష్టాలు ఏపాటి?

ఒక్కొక్కప్పుడు ఉన్నట్లుండి శ్రీబాబు 'ఏమిటీ? నీవు ఏదో ఆలోచిస్తున్నావు, నీ మనస్సు ఎక్కడ ఉన్నది?' అనేవారు. వారు ఏది చూసి అలా అంటున్నారు? నీ మనస్సునీలో ఉండాలి. కాని అది ఎక్కడో సంచారం చేస్తున్నది. ఆ మహానుభావుడు నీ మనస్సును పట్టుకున్నాడు. నీ పనులు నీవు చేసుకుంటూ, నీ మనస్సును ఆయన పాదాల దగ్గర పడెయ్యి.

ప్రతిదానిలో మనం వివేకం కలిగి ఉన్నాము. కాని మనం దానిని ఉపయోగించుకోవాలి. అందరూ చదువుకున్నవాళ్ళే. కొందరు బాగా చదువుకున్నారు. పెద్ద పెద్ద చదువులు. నేను చదువుకోలేదు. అయినా నేను బ్రతకటంలా?

కాలు కాలుకు ఉపయోగపడదు. ఫ్యాన్ ఫ్యాన్‌కు ఉపయోగపడదు. అలాగే కన్ను అన్నిటిని చూడగలదుగాని తనను తాను చూసుకోలేదు. ఈ సృష్టిలో ఏ జీవి తనకుతాను ఉపయోగపడదు. ఒక్క మానవుడు తప్ప. పైగా ఒక్కొక్క అవయవం ఒక్కొక్క పనినే చేయగలదు. కన్ను చూడగలదు కాని వినలేదు. చెవి వినగలదుగాని చూడలేదు. కాని వీటన్నిటికి, ఇవన్నీ నడవటానికి, పనిచేయటానికి కారణం ఒకటి ఉన్నది. అదే చైతన్యం. అది మనకు కనిపించదు. ఎలా అంటే కరెంట్ మనకు కనిపిస్తుందా? కాని చెయ్యి పెడితే షాక్ కొడుతుంది.

తనను తాను గుర్తించటానికి, ఆనందించటానికి మానవుడికి బుద్ధిని ఇచ్చాడు భగవంతుడు. కుక్క తనను గురించి ఆలోచించలేదు. గాడిద తనను గురించి ఆలోచించలేదు. కాని మానవుడికి మాత్రం తనను గురించి తాను తెలిసికొనే అవకాశం ఉన్నది. కాని మన మనస్సు మనను గురించి ఆలోచించక బాహ్యమైన ఆకర్షణలకు లొంగిపోతున్నది. మామిడిపండు చెట్టుమీద ఉన్నప్పుడే

చిలుకదానిని ఆహారంగా స్వీకరిస్తుంది. మానవుడి చేతిలో పడితే అది అక్కడకు రాదు. పశువులు కూడ నేరుగా సహజమైన పచ్చికను ఆహారంగా మేస్తాయి. కాని మనం రుచులకు అలవాటుపడి సహజమైన ఆహారాన్ని తీసికోము.

ప్రాణం ఎంతవరకు ఉంటుందో ఎవ్వరూ చెప్పలేరు. ఆఖరుకు జ్యోతిష్కులకు కూడ వారి ప్రాణం ఎంతవరకు ఉంటుందో అనుమానమే. వారు మాహాత్ముల దగ్గరకు వచ్చి తమ జీవితం ఎంత వరకో అడుగుతారు. ఎందుకంటే అది శాస్త్రాలకు అందేదికాదు.

పరమాత్మ జీవుడుగా ప్రకాశిస్తున్నది. మనం అటువంటి శక్తిని ఉపాసన చేస్తున్నాము, ధారణ చేస్తున్నాము. జగన్మాత దర్శనాన్ని, భగవద్దర్శనాన్ని అనంతంగా పొందాలికాని, ఖండంగా, ఖండదృష్టితో కాదు. ఇంకా ధ్యానం చేస్తే ఎంత బాగుంటుంది? అని మనస్సును ఆవేదన పూరితంగా చేసికోవాలి.

దేహానికి ఆరోగ్యం కావాలి అంటే మందుతో పాటు పథ్యంకూడ అవసరం. మనస్సుకు వచ్చే రోగానికి భగవంతుడితో యోగం కావాలి. ఎంతవరకు? అంటే ఈ శరీరం మీద మమకారం పోయేవరకు. కొందరు మహాత్ములు దేహం ఉన్నాదాని బాధలను వారు అనుభవించటంలేదుకదా? నాకే ఈ బాధలు ఎందుకు కలుగుతున్నాయి? అంటే నీకు ఈ దేహం మీద ఇంకా అభిమానం పోలేదు గనుక. ఈ శరీరంలోని కొన్ని కొన్ని అవయువాలు కూడ కొంతవరకే ఉపయోగపడతై. ఎప్పుడైనా అవసరం వచ్చి ఏదైనా అవయవాన్ని ఆపరేషన్ చేసి తీసివేయవలసి వస్తే కూడ నీవు జీవనం సాగిస్తూనే ఉంటావు.

కూర్చొని భగవంతుణ్ణి గురించి ఆలోచిస్తుంటే మనస్సు యోగం చెందాలి. మనం అమెరికా వెళ్తే డాలర్లు తీసికెళ్తాం. లండన్ వెళ్తే పౌండ్లు తీసికెళ్తాం. ప్రతిదీ వివేక దృష్టి . కాని ఈ దృష్టి మనకు సార్థకత కలిగించదు. దానికి మనం ఇందులో ఉన్న సత్యాన్ని గుర్తించాలి. దీనిలో ఉన్న ఆ అనంతమైన దానిని గుర్తించటానికి ఏకాగ్రత అవసరం. ముందు విశ్వాసం కావాలి. లేకపోతే వినరు. ఒకవేళ మన పిల్లవాడు ఏదన్నా అనరాని మాట అన్నా, అక్కడ ఉన్నవాడు ఇలా అన్నాట్ట, అలా అన్నాట్ట అప్పటికీ మావాడు వాణ్ణి మరీ అంతగా ఏమీ అనలేదు అని చెప్పుకుంటారు. అదే పక్కఇంటి పిల్లవాడు ఏదైనా అన్నాడు అంటే దానికి ఎన్నో పెడర్థాలు తీస్తారు.

స్థిరమైన విశ్వాసాన్ని పెంపొందించుకోవాలి. బయటి జీవితం తాత్కాలికమైనదే కాని అందులో ఉన్నది శాశ్వతం. కరెంటు ఉన్నట్లు తెలియాలి అంటే ఒక ఉపాధి అవసరమైనట్లే, దానికీ ఒక ఉపాధి అవసరమైంది. అందుకని దానిని గుర్తించటానికి మనం ఈ ఉపాధిని జాగ్రత్తగా చూసుకోవాలి.

-సశేషం

## శ్రీ బాబూజీ దివ్యవాణి

సంసారమనే సుడిగుండంలో చిక్కుకొని ఉన్నది మానవ జీవతం. దాని నుండి బయటపడలేక మానవుడు సతమతమవుతూ ఉంటాడు. మాయ అనె పాశం అతనిని పుట్టగానే పెనవేసుకుంటున్నది. పెరిగిన కొలది అది బిగుస్తుందిగాని సడలదు.

అమీబా అని పిలువబడే ఏకకణ జీవి మాదిరిగ ఈ మాయ నీ శైశవంలోనే నీకు తెలియకుండా నీలో ప్రవేశించి తన ప్రాబల్యం చూపుతూ నిన్నొక కీలుబొమ్మవలె ఆడిస్తూ ఉంటుంది. దీని ఫలితమే సంసారం. 'నేను', 'నాది' అనే భావం బీజరూపంలో అత్యంత శైశవావస్థలోనే నీలో నిక్షిప్తమై, క్రమంగా వేరూని మొలకెత్తి పెరుగుతూ, తుట్టతుదకు పెక్కు శాఖోపశాఖలుగా విస్తరిల్లి, అరిషడ్వర్గమనే ఆకు జొంపములతో ఒక మహావృక్షంగా తయారవుతుంది.

"మొక్కై వంగనిది మ్రానై వంగుతుందా'' అని తెలుగులో ఒక సామెత. కనుక, ఈ సంసారవృక్షం తనలో అంతకంతకూ వృద్ధి చెందకుండా ఆధ్యాత్మిక సాధకుడు మొదటినుంచీ జాగ్రత్త పడడం అవసరం. స్వార్థ ప్రవృత్తులను ప్రేరేపించె 'అహం' పెరగడమే సంసారమునకు మూలం. సంసారం నన్ను వదల కుండా ఉన్నది, దానిని వదిలించుకోడం సాధ్య పడడంలేదు,'' అనె వాదం తరుచుగా వింటూ ఉంటాము. కాని, ఈ వాదం తప్పు-భ్రమాత్మకం. సంసారం నిన్ను పట్టుకొన్నదనే మాట అబద్ధం. నీవే సంసారాన్ని పట్టుకొని వ్రేలాడుతున్నావు.

ఈ సంసారపాశాన్ని వదిలించుకొని బయటపడడానికి కుటుంబ బాధతలను విడనాడవలసిన ఆగత్యంలేదు. కుటుంబ విషయములో సంగ రహితంగా వ్యవహరించటమే కావలసినది. ఏలనంటే సంసారం ఎక్కడనో లేదు, నీ మనస్సులోనే ఉన్నది. అమృత బిందూపనిషత్తు, బోధించినది ఇదే.

**"మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః।**
**బంధాయ విషయాసక్తం, ముక్తైః నిర్విషయం స్మృతమ్॥''**

అనగా, బంధానికి, బంధవిమోచనకు కూడ కారణం మనస్సే. ఐహిక విషయువాంఛలనుండి మనసు విడివడాలంటే, దానిని భగవానుని పాదపద్మములందు లగ్నం చెయ్యాలి.

ఆ విధంగా భగవత్పాద కమలములందు మనస్సును లగ్నం చేసినప్పుడు, సంసారం అసత్యమనేది నీవు తెలిసికొనటం మొదలుపెట్టుతావు. 'యీషణత్రయం' అనే మూడుముడులతో నీవు బంధించబడి ఉన్నావు- దారేషణ, ధనేషణ, పుత్రేషణ, భార్యయందు, ధనమునందు, పుత్రులయందు సంగం

కలిగియుండటమన్నమాట. అత్యంత ప్రబలమైనది కాబట్టే ఈ యీషణత్రయం నిన్ను అజ్ఞానమనే ఊబిలో కూరుకొని పోయేటట్లు చేస్తుంది.

భార్యయందు, ధనమునందు, పుత్రులయందు గల ఈ తగులం కేవలమూ తేనె పూసిన విషగుళికయే. ఈ విషం నీ రక్త నాళాలద్వారా శరీరమంత వ్యాపించి నిన్ను సంసార సముద్రంలో పడేటట్లు చేస్తుంది. మరి, ఈ విషానికి ఏమిటి విరుగుడు?

భక్తి, సంగరాహిత్యము, జ్ఞానము, అనెడి మూలికాత్రయమే ఈ ఈషణా త్రయమునకు విరుగుడు. నిజమాలోచిస్తే, బంధువులు నీ జ్ఞాన విత్తమును దోచుకునే దొంగలు. పుత్రులు నీకు ఋణమిచ్చి తీర్చుకో వచ్చినవారు. ఇక భార్యలో, సమస్త దుఃఖమునకూ మూలం వారే. ఈ భౌతిక శరీరము, ధనమునకు అత్యంత ప్రలోభకారణాలు. మొత్తము మీద ఇదంతా నిన్ను అథోగతికి లాగుకొని పోయేదే.

మామిడికాయ పచ్చిగా ఉన్నంతకాలం అది చెట్టునే అంటిపెట్టుకొని ఉంటుంది. మధురరసంతో చక్కగా పండినప్పుడు, దానంతటదే చెట్టు నుండి రాలిపోతుంది. అదే విధంగా, మనస్సు శుద్ధము, పక్వమునై, చక్కగా ముగ్గిన జ్ఞానఫలంగా రూపొందినప్పుడు, దానంతటదే సంసార వృక్షం నుండి రాలిపోతుంది. అప్పుడు సంసారమనేది నీ ఆత్మోపలబ్ధికి ప్రతిబంధకంగా నిలువనేరదు. కనుక సంసారబంధముక్తుడవు కావడానికి, మనస్సును పరమాత్మ యందు లగ్నం చేసి అహంకారమును పూర్తిగా నిర్జించడమే మార్గం.

శ్రీ శంకరభగవత్పాదులు దీనినే భజగోవిదంలో వ్యక్తం చేశారు. సంసారమనేది అజ్ఞానరూపమైన అంధకారమేగాని వేరుకాదు గనుక, జ్ఞానరూపమైన ఉషోదయం కాగానే అది పటాపంచలై పోతుంది.

**"వయసి గతే కః కామవికారః। శుష్కేనీరే కః కాసారః।**
**క్షీణేవిత్తే కః పరివారః। జ్ఞాతేతత్త్వే కః సంసారః॥"**

వయస్సు మళ్ళిపోయినప్పుడు, కామ వికారం ఉడిగిపోతుంది. నీరు ఎండిపోయినప్పుడు, తటాక మనేది ఉండదు. ధనం తరిగిపోయినప్పుడు, పరివారం అదృశ్యమవుతుంది. జ్ఞానోదయమైనప్పుడు సంసారమనేది ఉండదు. కాళీగార్డెన్స్ విజ్ఞాన మందిరంలో శ్రీ కాళీ వరప్రసాద బాబూజీ ఒకనాటి తమ ప్రవచనంతో ఈ విషయమే శిష్యులకు బోధిస్తూ, సద్గురువునందు అచంచల భక్తి విశ్వాసములు పెంపొందించుకొని సంసారం నుండి విముక్తులు కండని హెచ్చరిక చేశారు. *

# సమర్థ సద్గురు నాథుని దివ్య చరిత్ర

(గత సంచిక తరువాయి) - స్వామి విజయేశ్వరానంద ప్రసాద్

సాధన కాలంలో శ్రీబాబు ముముక్షువులై అతి కఠినములైన దీక్షలు అవలంబించి, ఆహార నిద్రాదికములలో ఎన్నో నియమములను పాటించారు. ఎక్కువగా వంగ పువ్వు రంగు పట్టు బట్టలను ధరించేవారు. ఒకే ఒక పంచతో ఎన్నో రోజులు కాలక్షేపం చేసేవారు. స్నానం చేసే సమయంలో కౌపీనం ధరించి కట్టు పంచను ఆరవేసుకొని, మళ్ళీ దానినే కట్టుకునేవారు. ఆ పంచకు ఎన్నో కిటికీలు, ద్వారాలు (చిరుగులు) ఉండేవని స్వామి చెప్పారు. కొన్ని నెలలపాటు రోజుకు ఒక్కసారి, అయిదు ముద్దలు మాత్రం ఆహారం తీసుకొనేవారు. కొంతకాలం ఒకే ఒక ముద్దతో గడిపేవారు. కొన్నాళ్ళు గుప్పెడు పెసలో, శనగలో,



అటుకులో నానవేసుకొని అవి మాత్రమే ఆహారంగా తీసుకొనేవారు. లేదా ఒక గ్లాసు పాలుగాని, మజ్జిగగాని తీసుకొని ఉండేవారు. కొబ్బరి నీళ్ళు మాత్రమే తీసుకొని సాధన చేసిన రోజులూ ఉన్నాయి. కేవలం మంచినీళ్ళు మాత్రమే తీసుకొని ఉన్న సందర్భాలు ఎన్నో ఉన్నాయి. "నీరు నారాయణ స్వరూపము. అందువలననే నేను నీరు స్వీకరిస్తున్నా , నారాయణ తత్త్వమనే అమృతరసాన్ని స్వీకరిస్తున్న ఆనందం కలిగేది. ఆ నారాయణ స్మరణామృతరసమును పానం చేసిన వారికి ఆకలి దప్పుల వలన బాధ కలుగదు కదా?'' అనే వారు శ్రీబాబు. వస్త్ర భోజన సౌకర్యములెంత తక్కువగా ఉన్నా , అష్టైశ్వర్యములను మించిన అమ్మ దర్శన భాగ్యము, జగన్మాత కృపారస మధురపానము, సదా వారికి పుష్కలంగా లభిస్తూ ఉండేవి.

సాధన కాలంలో శ్రీబాబు మంచంపై నిద్రించేవారు కాదు. చాపపైగాని, బల్లపైనగాని, పరుపు వేసుకునో, వస్త్రం పరుచుకునో పడుకునేవారు. అరుగులపైనో, గోదావరీనది లోని ఇసుక తిన్నెలపైననో తమ చేతినే తలగడగా చేసుకొని పరున్న సమయాలూ ఉన్నాయి. పండు వెన్నెలలో యిసుక తిన్నెలపై పవళించి, ఆత్మవిచారణ అనే అమృతపానం చేస్తూ తాము పొందిన

ఆనందమును గురించి శ్రీబాబు వర్ణిస్తుంటే "రాజ ప్రాసాదాలలో నివసిస్తూ షడ్రసోపేత భోజనం చేస్తూ, హంసతూలికా తల్పం పై శయనిస్తున్నా మేము పొందలేకపోతున్న తృప్తినీ ఆనందాన్నీ, మీరు యిసుక తిన్నెల పైననో రాతి అరుగుల పైననో శయనిస్తూ కూడా ఎలా పొందగలుగుతున్నారు?" అని జయపూర్ మహారాజు శ్రీ విక్రమదేవ వర్మ శ్రీబాబును అడిగారు. శ్రీబాబు "మీరు ఆయా సౌఖ్యాలను అనుభవిస్తూ పొందుతున్న ఆనందము, పరిణామ సహితమై అస్తి నాస్తి భేదములతో కూడిన విషయానందము. నేను పొందుతున్నది పరిణామ రహితమైన, నిత్యమైన, సత్యమైన ఆత్మానందము" అని చెప్పారు. శ్రీబాబు పర్యటనలో అధిక భాగము పాదచారులుగానే గడిపారు. రైలులోగాని, బస్సులోగాని, అప్పుడప్పుడు ప్రయాణం చేసేవారుగాని, సామాన్యంగా అందుకు కావలసిన ధనం తమ వద్ద ఉండేది కాదని శ్రీబాబు చెప్పారు.

ఒకపర్యాయము మండుటెండలో పాదరక్షలుకూడా లేకుండా నడచి, శ్రీబాబు పూర్తిగా అలసిపోయారు. సాయంకాలానికి ఒక చలివేంద్రం వద్దకు చేరుకున్నారు. అక్కడ కాసిని మజ్జిగ నీళ్ళు దాహం తీసుకొని, తాటాకులపై పైపంచ పరచుకొని, ఒళ్ళు తెలియకుండా సొమ్మసిల్లి నిద్రపోయారు. అక్కడి వాళ్ళు ఆ రాత్రి యిళ్ళకు వెళ్ళిపోతూ, శ్రీ బాబును నిద్ర లేపినా లేవలేదు. మర్నాటి ఉదయం మళ్ళీ వాళ్ళు వచ్చి, శ్రీబాబు అలాగే పడుకొని ఉండటం చూసి, జాలిపడి నిద్ర లేపారు. శ్రీబాబు లేచేసరికి, ఆ తాటాకుల క్రింద నుండి చప్పుడు చేసుకుంటూ ఒక త్రాచుపాము బయటకు వచ్చి, పడగ వంచి శ్రీబాబుకు ప్రదక్షిణం చేసి వెళ్ళిపోయింది. అక్కడి వాళ్ళంతా నిశ్చేష్టులై "మీకు భయం లేదా?" అని అడిగితే, "భయమెందుకు? అదీ నాకు మల్లే అలసిపోయి వచ్చి ఉంటుంది. ఆ తాటాకుల క్రింద నిద్రపోయింది. మీరు నన్ను నిద్ర లేపితే, అదీ నిద్ర లేచి వెళ్ళిపోయింది. మనం దానికి ఏదైనా అపకారం తలపెడితే, అది ఆత్మరక్షణ కోసం మన మీదకు రావచ్చునేమోగాని, మన మనస్సులో దానియెడల ద్వేష భావం లేకపోతే దానికీ మనమీద ఏ విరోధ భావమూ కలుగదు. శేష శయనుణ్ణి మనస్సులో నిలుపుకుంటే భయం నిశ్శేషంగా హరించిపోతుంది" అన్నారు. వాళ్ళు "అది మీకు ప్రదక్షిణం చేసి వెళ్ళిందంటే, మీలో నారాయణ మూర్తినో, శివుణ్ణో చూసి ఉంటుంది" అని అన్నారు. శ్రీబాబు "అది నాలో ఏం చూసిందో నాకు తెలియదుగాని, నేను మాత్రం దానిలో ఆదిశేషుణ్ణి దర్శించాను" అన్నారు. వారందరూ శ్రీబాబు పాదాలు తాకి నమస్కారం చేసుకున్నారు.

-సశేషం

# హైదరాబాద్ సత్సంగ సమావేశములు -నివేదిక

- శివ ప్రసాద్

శ్రీ కాళీవనాశ్రమం భాగ్యనగర్ శాఖవారు ది. 7-8-2009 నుండి ది.9-8-20009 వరకు శ్రీ వీరాంజనేయ స్వామి మరియు శ్రీ నీలకంఠేశ్వర స్వామి వారి ఆలయం(కె.పి.హెచ్.బి.కాలని)లో ఏర్పాటు చేసిన సత్సంగ కార్యక్రమం దేవాలయ కార్యనిర్వాహకవర్గంవారి అభ్యర్థన మేరకు అయిదు రోజులకు పొడిగింపబడి ది. 11-8-2009 వరకు జరిగింది. ఉదయం కార్యక్రమాలు, సామూహిక గురుపూజలు ఆశ్రమ శాఖా భవనంలో జరిగాయి. సాయంత్రం సంకీర్తన, సత్సంగ కార్యక్రమం ప్రతిరోజు సాయంత్రం 5 గం॥ నుండి 8 గం॥ వరకు కె.పి.హెచ్.బి. కాలనీలో ఆలయంలో జరిగాయి.

**7-8-2009**

సాయంత్రం సంకీర్తన అనంతరం 6గం॥ నుండి 6గం॥ 30ని॥ వరకు డా॥ రామతారక పరబ్రహ్మ ప్రసాద్ ప్రవచనం చేశారు. జీవితంలో అందరూ కోరుకునే సుఖశాంతులకు మూలసూత్రం సత్సంగంలో ఉన్నది. సూర్య వర్చస్సే సువర్చల. సూర్యుని శిష్యుడైన ఆంజనేయుడు ఆ ప్రకాశమును గ్రహించాడు. అదే సువర్చలతో వివాహం జరగటం అంటే. ఆంజనేయుడు మనకు బుద్ధిని, బలాన్ని ప్రసాదించి రోగాలని హరిస్తాడు. శాస్త్రాలన్నీ సూర్యుని దగ్గర అధ్యయనం చేసిన, మానవ మాత్రుడుగా, రాముడుగా అవతరించిన బ్రహ్మమును సేవించి బ్రహ్మవిదుడైనాడు. తనను ఆశ్రయించిన వారందరికి సత్యజ్ఞానాన్ని ప్రసాదిస్తాడు. ఆయన చెప్పింది ఆచరిస్తే మనమూ ఆ ఆంజనేయుడు పొందిన స్థితిని పొందగలుగుతాము అని చెప్పారు.

అనంతరం 6గం॥ 30ని॥ నుండి శ్రీ మాతాజీ తమ అనుగ్రహ భాషణలో - సత్సంగం మనం ఎక్కడో బయటనుండి తెచ్చుకునేది కాదు. మనం నిరంతరం సత్సంగంలోనే ఉన్నాము. మనం బయటనుండి తెచ్చుకునే వన్నీ, చివరకు ఈ శరీరంతో సహా అన్నీ నశించేవే. ప్రపంచంలో మానవుడు పడే ఆవేదన ఒక్క భగన్నామంతో తప్ప మరి దేనితోను తీరదు. మీరా తల్లి మనస్సును కుసంగం వదలి, సత్సంగంలో కూర్చో. ఎందుకంటే అక్కడ భగవంతుని గురించిన చర్చ జరుగుతుంది అని హెచ్చరించింది. సర్వ వ్యాపకమైన ఆ భగవచ్ఛక్తిని మనం గుర్తించాలంటే మనకు ఒక గురుదేవుడు అవసరం. ఆంజనేయ స్వామికి రాముడు, సీతమ్మ గురువులు. సీతమ్మ ప్రకృతి మాత. ఆ ప్రకృతిమాత చెప్తేనే ఆంజనేయుడికి గురుతత్త్వం తెలిసింది. మనస్సు ప్రకృతి స్వరూపం గనుక ఆ మనస్సును రైట్ రూట్‌లో పెట్టుకోవాలి. అన్నం అన్నం అంటూ కూర్చుంటే కడుపు

నిండనట్టు, కేవలం రామనామం అంటుంటే కడుపు నిండదు. దానిని ఆస్వాదించాలి. రోగం తగ్గాలంటే మందుతో పాటు పథ్యంకూడా ఎలా చేయాలో అలాగే నామస్మరణతో పాటు సత్సంగంలో శ్రవణం చేసిన దానిని ఆచరించాలి. మనలో ఉన్న అహంకార మమకారాలను, రాగద్వేషాలను, అసూయ, అసహనం, ఓర్వలేని తనాలను రహితం చేసుకోవాలి. దారాపుత్రాదుల పైన ప్రేమ ఉండవచ్చు కాని మమకారం ఉండకూడదు. ఇంట్లో ముందు పెద్దవాళ్ళు ఆంజనేయస్వామిని అనుష్ఠానం చేస్తే క్రమంగా పిల్లలు కూడా నేర్చుకుని దుర్వ్యసనాలవైపు పోకుండా మంచి గుణాలు అలవాటు చేసుకుంటారు. ఎవరూ తమ స్వధర్మాన్ని మానవలసిన అవసరం లేదు. ఆంజనేయుడు సుగ్రీవుడి దగ్గర మంత్రిత్వం చేస్తూనే గురుతత్త్వాన్ని గ్రహించి బ్రహ్మజ్ఞాని అయినాడు. జనకుడు, శివాజీ మహరాజ్ రాజ్యపాలన మానకుండానే గురుదేవులను ఆశ్రయించి తరించారు. మాయ దైవీ శక్తి. దానిని మన శక్తితో మనం దాటలేము. భగవంతుడి శక్తి మాత్రమే దానిని దాటించగలదు. సమర్థులైన గురుదేవులను తత్త్వ స్వరూపుడిగా తెలుసుకొని వారు చెప్పింది చెప్పినట్లు విని, పెట్టింది పెట్టినట్లు తిని, చచ్చినట్లు పడిఉంటే వారు నీవెవరో నీకు తెలియచేస్తారు. అలా తెలుసుకున్నవారే ఆంజనేయస్వామి, మీరా మొదలైనవారు. మనం వారి భక్తివైరాగ్యాల వంటి భక్తివైరాగ్యాలను పెంపొందించు కోవాలి - అని చెప్పారు.

**8-8-2009**

సంకీర్తన అనంతరం 6గం॥ నుండి 6గం॥ 30ని॥ వరకు శివ ప్రసాద్ మాట్లాడారు. మానవుడు సచ్చిదానంద స్వరూపుడు గనుక ఆనందాన్నే కోరుకుంటాడు. అయితే మనస్సుకు ప్రాపంచిక విషయాలలో ఆ ఆనందం ఉందీ అని ఆరూఢమైన ఒక నమ్మకం ఉన్నందున ఆ ఆనందంకోసం ప్రపంచంలోని విషయాదుల వెంట పడతాడు. తన మనోమయ వాసనా ప్రపంచం వలననే, బాహ్య ప్రపంచం అతడిని బాధలకు, అశాంతికి గురి చేస్తుంది. దీని నుండి బయట పడాలంటే బుద్ధి ఈ ప్రపంచం అంతా మిథ్య, కల్పిత దృశ్యం అని గాఢంగా విశ్వసించాలి. దానికి ఒక గురుదేవుణ్ణి ఆశ్రయించి తన స్వరూపాన్ని జగత్తు యొక్క స్వరూపాన్ని నిశ్చయ పూర్వకంగా తెలుసుకోవాలి.

అనంతరం శ్రీ మాతాజీ తమ అనుగ్రహ భాషణలో - ఎక్కడ రామ నామ సంకీర్తన జరుగుతుంటుందో అక్కడ ఆంజనేయుడు పరవశంతో ఆనంద బాష్పాలు కారుస్తుంటాడు. అటువంటి ప్రభు భక్తి పరాయణుడు మరొకడుండ బోడు. ఆంజనేయ స్వామిది కేవలం దాస్య భక్తి మాత్రమే కాదు. ఆయనలో

నవవిధ భక్తులూ ఉన్నాయి. ముందు ఆయన కరుణ కలిగితే, తరువాత రామచంద్రుడి కరుణ తప్పక కలుగుతుంది. ఆంజనేయ స్వామిని గుర్తించాలంటే నిరంతర భక్తి, రామనామమందు ఆసక్తి కావాలి. గడ్డి పోచ కన్నా హీనుణ్ణి అన్న భావన తనను నరుకుతున్న వాడికి కూడా నీడను, ఫలాలను ఇచ్చే వృక్షము క్షమ, మానావమానములయందు సమదృష్టి ఉన్నవారే హరినామం చేయటానికి అర్హులు. ఆంజనేయ స్వామికి భక్తితో పానకం నైవేద్యం పెడితే తప్పక వర్షాలు కురుస్తాయి. వెళ్ళేటప్పుడు చిల్లి గవ్వ అయినా, ఆఖరుకు ఈ శరీరం సైతం తనతో రాదు అని తెలిసినా, దానిమీద మమకారం పోవటంలేదు. అక్కడ ఉండే పాండురంగడు ఇక్కడ ఉండాలంటే ముందు మనం ప్రత్యక్ష పార్వతీ పరమేశ్వరులైన తల్లితండ్రులను ఆదరపూర్వకంగా సేవించాలి. నరుడు సాధించలేని జితేంద్రియత్వాన్ని వానరుడు అయిన ఆంజనేయుడు సాధించి, తన దాస్య భక్తితో బ్రహ్మజ్ఞాని అయినాడు. ఆయన కున్న భక్తిజ్ఞాన వైరాగ్యాలను మనము పొందాలంటే, అందుకు అడ్డం వచ్చేది మన మనస్సే. విషయాసక్తమైన మనస్సు బంధానికి కారణమైతే, విషయరహితమైన మనస్సు మోక్షానికి సాధనం అవుతుంది. రామనామము రమ్యమైనది. అది మనందరి సొంత ప్రాపర్టీ. అలాగే శివనామం. అలాగే ఎవరికి వారి ఇష్టదైవం నామం. హరిహరులయందు భేద దృష్టి ఉన్నవాడు ఎన్నటికి తరించలేడు - అని చెప్పాడు.

**9-8-2009**

సుప్రభాతం, మేలుకొలుపు, ప్రార్థన అనంతరం ఉదయం 11గం॥లకు ఆశ్రమ శాఖా భవనంలో సామూహిక గురుపూజలు జరిగాయి. సాయంత్రం సంకీర్తన తరువాత 6గం॥లకు శ్రీ మనోజ్ ప్రసాద్ మాట్లాడుతూ, ఏది సత్యమై, నిర్గుణమై, నిరాకారమై ఉన్నదో అదే శ్రీరాముడు అని, ఏది సత్య వస్తువుతో నిరంతరం కలిసి ఉన్నదో అదే ఆంజనేయుడు అని, జీవుడూ, పరమాత్మ నిరంతరం కలిసి ఉండటమే సత్సంగం అని చెప్పారు. మనందరం ఆత్మ సామ్రాజ్యాన్ని పోగొట్టుకున్నాము. దానిని గురుకృప సాయంతో తిరిగి పొందాలి. ఆంజనేయుడు తన భక్తిని నిరూపించటానికి, రాముడిని నిరంతరం తన హృదయంలో ఉన్నాడు అని అందరికి తెలియటానికి తన హృదయాన్ని చీల్చి చూపించాడు. తులసీదాస్ హనుమాన్ చాలీసాలో చివరికి చెబుతాడు. అన్య దేవతలను పూజించనవసరం లేదు. హనుమంతుణ్ణి సేవిస్తే అన్ని సుఖాలూ ఆయనే ఇస్తాడు అని. ఆంజనేయుడి ఏక నిష్ఠ భక్తి వంటి భక్తిని మనందరం పెంపొందించు కోవాలి అని చెప్పారు.

-సశేషం

# ఆగస్టు త్రయాహ్నిక సత్సంగ కార్యక్రమం - నివేదిక

- శివ ప్రసాద్

ఆగస్టు నెల త్రయాహ్నిక సత్సంగ కార్యక్రమం బయట ఊళ్ళ నుండి వచ్చే భక్తుల సౌకర్యార్థం కృష్ణాష్టమి వేడుకలతో కలిపి ది. 13నుండి ది. 15 వరకు జరిగింది. కృష్ణాష్టమి కార్యక్రమాలననుసరించి సత్సంగ కార్యక్రమం వేళలలో స్వల్పంగా మార్పులు జరిగాయి.

ది. 13-8-2009

ఉదయం 11గం॥30ని.లకి మొదటి సభ రామాలయంలో జరిగింది. శ్రీ మాతాజీ ప్రారంభోపన్యాసం చేస్తూ - రాముడు మర్యాదా పురుషుడు. కృష్ణుడిలో కూడా మర్యాద ఉన్నది కాని అది ఫ్లెక్సిబుల్(flexible). ఎవడు తనను గుర్తిస్తాడో వాడికి భక్త పరతంత్రుడు. నాకేమీ తెలియదు అని చక్కగా ఆశ్రయిస్తే, నీకేమి కావాలో నేను చూస్తాను అన్నాడు భగవానుడు. రాక్షస బాధలు భరించలేక పోతున్నాము. నీవు సృష్టికి రావలసిందే అని దేవతలు ప్రార్థిస్తే, శ్రీకృష్ణుడు 'పదండి వస్తున్నా, నాతో సావాసగాళ్ళు రావాలి. వాళ్ళందరూ ముందు సృష్టికి వస్తారు. తరువాత నేను వస్తాను' అన్నాడు. అంటే మనం వచ్చేశాము. భగవంతుడి తత్త్వము నీలో ఉన్నది. మనం భగవంతుణ్ణి ఎప్పుడు మర్చిపోతామో అప్పుడు మన జీవితం పోయినట్లు. మనం ఆయన పాదాల చెంతనే ఉన్నాము. ఆ చిన్ని పాదాలు పట్టుకున్నాము. గోరింటాకు పెట్టుకున్నాము. తనను తాను గుర్తిస్తూ ఉంటే చాలు. తాను పరమాత్మ అన్న దృష్టి కలిగినప్పుడు ఆనందం కలుగుతుంది. ఆనందం అనేది మన దగ్గరే ఉన్నది. మనం పొందటంలో ఉన్నది. మన అంతరంగంలో ఉన్న పరమాత్మను గుర్తించకుండా గుళ్ళో ఉన్నాడని, గుళ్ళో విగ్రహాన్ని చూసి అది మాత్రమే కృష్ణుడు అనుకుంటాము. కాని అది మాత్రం అంతే కాదు. అది నీ స్వతం. కూర్చుని నామం చేసుకుంటే అప్పుడు నీ మనస్సు నామంలో రమత చెందుతుంది. మన కాలం దాటిపోక ముందే అటువంటి మాధుర్యాన్ని పొందటానికి తగిన సాధన అలవర్చుకోవాలి. మాటిమాటికి పండుగలు ఇస్తూ నీకు అందుబాటులో ఉన్న వాడినే రా అంటున్నాడు భగవంతుడు. కాని విషయాదులలో పడి, నీవే దానిని దూరం చేసుకుంటున్నావు. ఈ కృష్ణాష్టమి మూడు రోజులు సత్సంగంలో అంతా కృష్ణమయంగా, కృష్ణుడి పరంగా మాట్లాడుకుందాం. అందరం అలా శ్రీకృష్ణ తత్త్వంలో సమయాన్ని సద్వినియోగం చేసుకుందాము - అని చెప్పారు.

12గం॥లకు శ్రీపరాశర ప్రసాద్ మాట్లాడుతూ కృష్ణాష్టమి సందర్భంగా శ్రీబాబూజీ చెప్పిన ఒక కథ చెప్పారు. వ్రేపల్లె వాసులందరు కృష్ణుని దర్శనం

కోసం తహతహలాడారు. చూసిన వారంతా ఆ ఆనందం అనుభవిస్తుంటే ఒకామె ఆ కృష్ణుడు ఎలా ఉంటాడో చూద్దాం అని బయలుదేరి వెళ్ళింది. ఆమె బయటికి వెళ్ళగానే కృష్ణుడు ఆ ఇంట్లో ప్రవేశించి ఉన్న వెన్నంతా తినేశాడు. ఇంతలో ఆమె వచ్చింది. ఆమె ఇంతకుముందు కృష్ణుని చూడలేదు. అందువలన వచ్చింది కృష్ణుడు అని తెలియదు.

**ఆమె -** నీవెవరు?

**కృ -** నేను బలరాముడి తమ్ముణ్ణి.

**ఆమె -** అదేమిటి? నీవెవరని అడిగితే బలరాముడి తమ్ముణ్ణి అంటావేమిటి?

మనమూ అంతే. నీవెవరు? అంటే నేను ఫలానావారి కొడుకును అనో నా పేరు ఫలానో అనో, ఫలానా ఉద్యోగం అనో చెప్తాము. కాని నిజానికి మనం ఎవరో మనకు తెలియదు.

**ఆమె -** అయితే అక్కడ ఏం చేస్తున్నావు? ఎందుకు వెన్నంతా కెలుకుతున్నావు?

**కృ -** మా ఆవుదూడ తప్పిపోయింది. ఇందులో ఉందేమో అని వెతుకుతున్నా.

**ఆమె -** ఆవుదూడ అందులో ఉంటుందా?

నీవూ అంతేగా. నీలో ఉన్న దానిని గుర్తించకుండా, బయట ఎక్కడో ఉన్నదని విషయాల వెంట పడుతూ జగత్తులో వెతుకుతున్నావు.

పరాశర ప్రసాద్‌గారు 'జీవితంలో సమయముండగానే తెలుకోవలసింది తెలుకోవాలి, సమయం దాటిపోతే ఒక్క క్షణాన్ని కూడ తిరిగి తెచ్చుకోలేము, ప్రతి శ్వాస భగవంతుడిది అని గుర్తించాలి' అని చెప్పారు.

12గం॥ 15ని॥లకు శ్రీవిజయేశ్వరానంద ప్రసాద్ మాట్లాడుతూ 'యమునా నది వంపుల గలగలలో' అనే పాట పాడి కరారవిందేతి పదారవిందం అనే శ్లోకం చదివారు. ప్రళయ సమయంలో అంతా జలమయం అయిన తరుణంలో, ఆ బాలముకుందుడు ఒక వటపత్రంపైన పడుకుని, తన అరచేతితో పాదారవిందమును పట్టుకుని దాని బొటనవేలు నోట్లో పెట్టుకుని చీకుతూ ఉన్నాడు. దీని అర్థం ఏమిటంటే 'అంతకన్నా మధుర్మైనది లేదు అని' అని చెప్పారు.

12గం॥ 55ని॥లకు శ్రీ జి. వెంకటేశ్వర్లుగారు (స్టేషన్ మాష్టారు) కూరత్తాళ్వార్ గురించి ఇతర వైష్ణవ భక్తుల భక్తి తత్త్వం గురించి ఉపన్యసించారు.

13గం॥ 15ని॥లకు శ్రీ మాతాజీ - విశ్వవ్యాప్తమై ఉన్న ఆ స్వామి చరణం సర్వవ్యాపకమైనది. మనం దానికి పుట్టుమచ్చలాగ అతుక్కుని పోవాలి. మనం సత్యంలోనే ఉన్నాము. సత్యమే అయి ఉన్నాము. కాని గుర్తించటం లేదు. సెనగ గింజను దేలో నానవేస్తే దాని రుచిని పొందినట్లు మన మనస్సును సత్సంగంలో నానవేస్తే అది దానినే పొందుతుంది - అని చెప్పారు.

ఆనాటి రెండవ సభ సాయంత్రం 4గం॥ 30నిలకు బృందావనంలో ప్రారంభమైనది. ముందు డా॥ రామతారక పరబ్రహ్మ ప్రసాద్ మాట్లాడుతూ - ఎందరో గురువులు ఉన్నా అందరూ జగద్గురువులు కాలేరు. జగద్గురువు అన్న ప్రసిద్ధి ఒక్క శ్రీకృష్ణుడికే వచ్చింది. రాముడు కూడ జగద్గురువే అయినా ఆయనకు ఆ ప్రసిద్ధి రాలేదు. ఆయన ప్రధానంగా ధర్మం బోధించాడు. కాని శ్రీ కృష్ణుడు మాత్రం జ్ఞానాన్ని బోధించాడు. మనం ఎవరో తెలియక పోవటమే మరణం. దానిని తెలిపే వాటిలో ప్రధానమైనది భగవద్గీత. మనందరకూ మాయ రోగం ఉన్నది. నేను పుట్టాను అనుకుంటాము. అదే భవరోగం. దానిని కుదర్చటానికి భవరోగ భిషగ్వరుడే కావాలి. త్యాగభావం సద్భావం ఉన్నవాళ్ళతో సాంగత్యం చేస్తే సద్గురువు మనకు లభిస్తాడు. మనందరికీ ప్రథమ గురువు తల్లే. మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్య దేవోభవ అని ఆర్యోక్తి. తల్లిదండ్రులలో ప్రేమ, వ్యామోహం ఉంటాయి. అవి అజ్ఞానంలో భాగం. దీనిని దాటి జ్ఞానబోధ చేసేవాడే గురుదేవుడు. అందుకే న గురోరధికం, న గురోరధికం, న గురోరధికం, న గురోరధికం. గురువు అంటే మన స్వరూపాన్ని తెలియజేసేవాడు అని అర్థం. తాను అనుభవాన్ని పొంది ఇతరులకు అనుభవాన్ని పొందించేవాడు గురువు. ఆ జగద్గురువు బోధిస్తే కూడ అర్జునుడికి పూర్తిగా అర్థం కాలేదు. స్మృతి వచ్చిందికాని జ్ఞానం రాలేదు. అహం బ్రహ్మాస్మి స్థితి రాలేదు. నీవు చెప్పినట్లు చేస్తా అన్నాడు. అందుకే అర్జునుడిని ఉత్తమాధికారిగా చెప్పలేదు. మధ్యమాధికారిగానే చెప్పారు. ఆ జగద్గురువే మనకు గురుదేవుడిగా వచ్చారు. రాముడవు నీవె, కృష్ణుడవు నీవె, వేసమును మార్చితివి, మమ్ముల మోసగింప అన్నారు కవిగారు. మనను మాయ చేసినట్లు మాయ చేసి మనను ఆ మాయలోనుండి బయటకు తెచ్చాడు.

తరువాత శ్రీ మాతాజీ మాట్లాడుతూ కృష్ణుడు, రాముడు, గురుదేవుడు అంటే మనకు భిన్నం ఎప్పుడూ కాదు. ఒక అనంత శక్తి. అనుసరించాలి, ఆనందాన్ని పొందాలి. కాని అనుకరిస్తే ఆనందం రాదు. నాకు తెలుసనుకోవటం కూడా అజ్ఞానమే. మనం భగవన్నామం చేస్తే అక్కడే ఉన్నాడు భగవంతుడు. మనం నిరంతరం ఆయన నామం చేసుకుంటే చాలు, మన యోగక్షేమం ఆయనే చూస్తాడు. భగవంతుని ఉనికి భక్తుడు. భక్తుడితో సత్సంగం చేస్తే, భగవంతుడంటే తెలుస్తుంది. ఒక సజ్జనుడు ఇంకొక సజ్జనుడితో రాచుకుంటే, కేవలము భగవంతుడి నామము, తత్త్వమే అక్కడ ఉంటుంది. అది ఒకరితో ఒకరు పంచుకుంటే అదే ధ్యానాగ్ని, అదే నామాగ్ని.

తరువాత జపమాల ప్రసాద మధురము మధురము గురు స్మరణం అనే పాట పాడి దాని పరమార్థాన్ని వివరించారు. *



# శ్యామసుందరా! ఒక్కసారి! ఒక్కసారంటే ఒక్కసారి తిరిగి కనిపించవూ!

(గతసంచిక తరువాయి) -రమణ ప్రసాద్

"ఇక మేము వ్రజభూమిలోని ప్రతి అణువులో కృష్ణుని దర్శనం చేసికోగలం! రండి...మేము మిమ్మల్ని అక్రూరుని ఇంటికి తీసుకువెళ్తాము..."

నగరవాసులు తన చుట్టూ నడుస్తుండగా ఉద్ధవుడు బయటకు నడిచాడు. నెమ్మదిగా నడుస్తూ అక్రూరుని ప్రాసాదం దగ్గరకు వచ్చాడు... సూర్యుడు పశ్చిమాద్రిపైనుండి తన చివరి కిరణాలను ఉపసంహరించుకుంటున్నాడు. ఉద్ధవుని ఆగనము గురించి, కృష్ణుని దేహము మహాకాలుడిలో కలిసిపోవటము గురించిన సమాచారం సుడిగాలిలాగా మధురా నగరం అంతా తెలిసి పోయింది... నగరవాసులందరూ తమ తమ పనులన్నిటినీ విడిచి ఉద్ధవుని వద్దకు చేరారు. అయితే కృష్ణుని గురించి ఎవ్వరూ ఏమీ అడగటంలేదు.అందరి వదనాలపై విచార రేఖలు అలముకొని ఉన్నాయి. అందరూ ఉద్ధవ దర్శనంలో సౌమ్యతను అనుభూతి పొందుతున్నారు...

ఉద్ధవుడు వచ్చాడు, కృష్ణుడు దేహత్యాగం చేశాడు - అన్న ఈ రెండు వార్తలు అక్రూరుని ప్రాసాదంలో తెలిసిపోయాయి. అక్రూరుడు ఎంతో నీరసంగా కనిపిస్తున్నాడు. కళ్ళచుట్టూ నల్లని చారలు ఏర్పడ్డాయి. వేళ్ళమీద నరాలు పైకి కనబడుతున్నాయి. ఆయన ప్రాసాదంలోని ముఖ్యద్వారం దగ్గరే ఒక ఆసనంపైకూర్చొని ఉన్నాడు. లోతుగా ఉన్న కళ్ళలో కొంచెం అస్థిరత కనపడుతోంది...

ఉద్ధవుడు దూరంనుండే అక్రూరుని చూశాడు. వెంటనే పెద్ద పెద్ద అంగలు వేసుకొంటూ ఉద్యానం దాటి అక్రూరుని చరణాలపైన వ్రాలాడు.. బాగా దగ్గరకు వచ్చాక అక్రూరుడు ఉద్ధవుని గుర్తు పట్టగలిగాడు.

" ఉద్ధవుడు తనకు ప్రణామం చేస్తున్నాడు!"

అక్రూరుడు అతనిని గట్టిగా కౌగలించుకున్నాడు. "పుత్రా! మధురానగరానికి కృష్ణుణ్ణి నేను మొదటిసారిగా తీసికొనివచ్చినప్పుడు నువ్వుకూడా కృష్ణునితో ఉన్నావు... ఇప్పుడు అదే మధుర.. అలాగే ఉంది. మనమిద్దరం అప్పటిలాగానే నుంచొనిఉన్నాం... కాని... కాని... కృష్ణుడు ఎక్కడా

లేడు... కృష్ణుని మధురకు తీసికొనివచ్చిన ఆ క్షణంలో..."ఉద్ధవుడి నోటి వెంట మాటలు రావటం లేదు. మాట్లాడలేకపోయాడు... ఆయన చెప్పదలచుకొని కూడ నోటితో చెప్పలేనివి ఆయన అశ్రువులే చెప్తున్నాయి.

ఉద్ధవుడు కన్నీళ్ళు ఎంత ఆపుకుందామనుకున్నా అవి ఆగటం లేదు. కనులు అవిరళంగా వర్షిస్తున్నాయి.

మధురలోని దుర్గంలో రాత్రి రెండవఝాము ప్రారంభసూచనగా ఢంకా వాయించబడింది. ఆ ధ్వని కాలయముని పిలుపులాగా ఆశనిపాతంలా ఉన్నది. దాని ప్రతిధ్వని ఆ చీకటి నిశీధిలో యమునా తరంగాలలాగ అలలు అలలుగా ఆకాశంలో వ్యాపిస్తూ దిగంతాలకు చేరుతున్నది. ఆ సమయంలోఒక ఉద్యానంలో ఉద్ధవుడు, అక్రూరుడు కూర్చుని ఉన్నారు. అక్రూరునిలో ముసలితనపు ఛాయలు ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి. ఆయన శరీరం బక్క చిక్కిపోయిఉంది. అక్రూరుడు అసనంమీద ఒక దిండు పైన కొద్దిగా ఆనుకొని కూర్చున్నాడు. ఆయన ముందు ఉద్ధవుడు ప్రౌఢునిగా, శక్తిమంతుడుగా కనిపిస్తున్నాడు. గవాక్షాలపై వేళ్ళాడదీసిన దివిటీలనుంచి వచ్చే వెలుతురుకి రెప రెపలాడే ధ్వజాల నీడలుకూడా మాటి మాటికీ కదులుతున్నాయి.నగరం అంతటా ప్రశాంతి నెలకొని ఉంది - అంతటా నిశ్శబ్దం! అక్కడక్కడ ఆవుల అంబారవాలు, లేక వృక్షాలనుండి రాలిన ఎండుటాకుల శబ్దాలు అక్కడ వీస్తున్న గాలి శబ్దాన్నిదాటి వినవస్తున్నాయి. కాళింది కెరటాలు తీరాన్ని తాకుతూ ముందుకు ప్రవహిస్తున్నాయి!

అప్పుడే పితికిన పాలతో నిండిన రెండు పాత్రలు ముక్కాలిపీటమీద సేవకుడు పెట్టి వెళ్ళాడు. అయినా వారిద్దరూ వాటివైపు చూడటంలేదు. అక్కడ వ్యాపించిన సన్నటి దీపకాంతిలో అక్కడి వాతావరణం అంతా మనకచీకటి అలముకొనిఉన్నది...

కృష్ణుడు దేహత్యాగం చేయటం. యాదవుల పట్టణమైన ద్వారకను త్యాగం చేయటం, అర్జునుడు అభీరసేనాపతి కుర్కటుని చేతిలో పరాభవం పొందటం -ఈ ఉదంతాలన్నీ ఒక్కొక్కటే ఉద్ధవుడు అక్రూరునికి వినిపించాడు. అక్రూరుడు తను వింటున్న ప్రతి శబ్దం తన హృదయంలో పదిలపరుస్తున్నాడు! దేవకీ వసుదేవుల అంతిమ క్షణాలను గురించి విన్న అక్రూరునికి శ్వాస ఆగినంత పని అయింది. ఆయన దృష్టి గతంలోకి పోయింది. గతించిన కాలాన్ని దాటి కంసుని నివాసం దానిని ఆశ్రయించిన కారాగారం...అందులో వసుదేవుడు

గడిపిన సర్వోత్తమమైన సంవత్సరాలు - ఆ కారాగారంలోనే కృష్ణుడు జన్మించినది. మరి... మరి... కంసుని ఆవాసం దగ్గర... అక్కడ... ఆ సభామండపం.... - అక్కడే ధనుర్యజ్ఞం నిర్వహించబడినది...

''తండ్రీ అక్రూరా!" తన మాటలను ఉపసంహారం చేస్తూ ఉద్ధవుడు ఇలా అన్నాడు "నియతియొక్క ప్రయాణంఎన్నటికీఆగదు. అది జరుగుతూనే ఉంటుంది. ఈ సూర్య చంద్రులు, నక్షత్రాదులు...ఇవేకాదు... ఈ కాళింది సైతం...నియతి చక్రం ముందు పేలవంగా కనపడతాయి. ఎండిన తమాలవృక్షపు ఆకులు రాలి గాలిలో ఎగురుతూఇంటి పైకప్పులపైన పడతాయి... ఇవన్నీ అంతే!

"ఉద్ధవా!" తన దీర్ఘ మౌనానికి స్వస్తి పలుకుతూ అక్రూరుడు అన్నాడు, "యమునా నది నీటి రంగు చూడు! ఇంతకు ముందు ఎప్పుడూ ఇలా ఇంత నీలంగా లేదు... రాత్రిపూట కూడా ఇంత నీలంగా ఉండటం నేను ఎన్నడూ చూడలేదు. కృష్ణుడు స్వయంగా శ్యామవర్ణుడు కదా! కృష్ణుడి దేహత్యాగం తరువాత ఆయన శ్యామవర్ణంతో ఈ ప్రకృతి అంతా నిండిపోయింది. చూడు....."

"అందుకే ఇప్పుడు ప్రకృతిలోని ప్రతికణంలోను కృష్ణుడు వ్యాప్తుడై ఉన్నాడు నాయనా! దేహధారి కృష్ణుడికి బదులుగా విదేహుడైన కృష్ణుని సాక్షాత్కారం ఇప్పుడు ఎంతో సహజంగా అవుతున్నది!" అని జ్ఞానవృద్ధుడైన ఉద్ధవుడు వయో వృద్ధుడు అయిన అక్రూరునితో అనునయ పూర్వకంగా అన్నాడు."

"వసుదేవుడు పొందిన సౌభాగ్యానికి నాకు ఈర్ష్య కలుగుతున్నది వత్సా!" అని అక్రూరుడు తన ఆలోచనలలో మునిగిపోయి అంటుంటే అతడు యమునానదిలో గలగల ప్రవహించే నీటితో మాట్లాడుతున్నట్లుగా ఉంది. "వసుదేవుడు యోగసమాధిలోకి వెళ్ళి యాదవ కులమహా నిర్వాణంలో చేరిపోయాడు... నా దురదృష్టం వలన నేను యోగసమాధి పొందే అవకాశం లేదు.

"తండ్రీ! మీరు బాధ పడకండి..."

- సశేషం

Printed, Published by C.V. Ramana Babu, on behalf of YOGINI SRI CHANDRA KALI PRASADA MATHAJI CHARITABLE TRUST and Printed at Samardha Sadguru Publications, D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh, and published at D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh. Editor - Guda Siva Rama Murthy,